యామినీపూర్ణతిలక

అను

# బిల్హణీయము

గ్రంథకర్త:

బులుసు వేంకటకవిగారు

అయ్యగారి రామశాస్త్రులుగారిచే

పరిష్కరింపఁబడినవి.

మొదటి కూర్పు

పబ్లిషరు:

కర్రా అచ్చయ్య అండు సన్సు

ఈశ్వరబుక్కు డిపో, రాజమండ్రి

రిజిష్టర్డు కాపీరైటు] 1934 [వెల 0—12—0

Title Page Printed at Sree. Vani Press, Rajahmundry.

శ్రీరస్తు.

యామినీపూర్ణతిలక

అను

# బిల్హణీయము

3 అంకముల నాటకము.

గ్రంథకర్త:

బులుసు వేంకటకవిగారు

అయ్యగారి రామశాస్త్రిలుగారిచే పరిష్కరింపబడినది

పబ్లిషర్సు:

కర్రా అచ్చయ్య అండ్ సన్సు

ఈశ్వర బుక్కుడిపో, రాజమండ్రి.

మొదటి కూర్పు.

శ్రీ లలితా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

రాజమండ్రి.

1934



వెల 0—12—0

# ఈ నాటకమునందు వచ్చు పాత్రధారులు

బిల్హణుడు—కవి కథానాయకుడు

మదనాభిరామరాజు—రాజు

వసంతుడు—మంత్రి

నారాయణభట్టు—ఆస్థానపండితుడు మొదటిగురువు

కేశవశర్మ—పురోహితుడు

వీరసేనుడు— } తలవరులు
పరిశేనుడు— }

విదూషకుడు—హాస్యగాడు

## స్త్రీలు

యామినీపూర్ణతిలక—కథానాయకి

కమలాక్షి— }
కీరవాణి— } యామినీపూర్ణ చెలికత్తెలు.
చిత్రరేఖ— }

యింకను కొందరు సభ్యులు వత్తురు.

---

# విజ్ఞప్తి

పాఠక మహాశయులారా యామినీపూర్ణతిలక యను నాటకమును వేమగిరి గ్రామకాపురస్థులును అస్మత్ప్రియ మిత్రులును అగు బ్రహ్మశ్రీ వుదయగిరి వేంకట్రామశాస్త్రిగారి యొక్క ప్రోత్సాహంబున వేమగిరిగ్రామంలో నేను వున్న 1911 సం॥ర ప్రాంతమున బిల్హణీయ మను ప్రబంధమూలము ననుసరించి మూడశ్వాసములకు మూడంకముల నాటకముగా వ్రాయనెంచి నాచిరుతప్రాయమునందే రెండంకములు మాత్రము వ్రాసి కొన్నికారణాంతరములచే మాస్వస్థలమగు నేదునూరను గ్రామనకు 1913 వ సం॥ రమున వెళ్ళవలసివచ్చెను. అచటనే మూడవ అంకమువ్రాసి నాటకము పూర్తిచేయుటయైనది నాటినుండియు నామిత్రులెందరు అచ్చువొత్తించమని ప్రోత్సాహపరచినను అనేకకారణాంతములచే వీలుపడక నేటికి రాజమండ్రి నివాసులగు మహారాజశ్రీ కర్రి అచ్చయ్యగారి ద్రవ్యసహాయమువలన అచ్చొత్తింపబడెను. సుమారు 23 సం॥రముల క్రిందట నాచిన్నవయసున వ్రాయబడిన దగుటచే యిందలి దోషములను పండితులును పుల్లేటికుర్రు గ్రామకాపురస్థులును అగు బ్రహ్మశ్రీ అయ్యగారి రామశాస్త్రులుగారిచే లేఖప్రమాదదోషములను ఛందోవ్యాకరణ దోషములను సాధ్యమైనంతవరకు సవరణచేయించబడెను. అయినను యిందలి స్వల్పదోషములేవేని ఉండినయెడల పండితులగువారు నాకు తెలియజేయుటకును మన్నించుటకును విద్వజ్జనంబులను ప్రార్థించుచున్నాడను. అట్టి తప్పులను ముందు ముద్రణమునందు సవరించుకొనుచున్నాను. ఈగ్రంథముద్రణసమయమందు ఏతత్కాలికదైవికములవలన సంభవించిన శ్రమనుగూర్చి దైవప్రార్థనగా రచింపబడిన తత్కాలికపద్యములు యిందు ముద్రించబడెను.

ఇట్లు పండితవిధేయుడు

బులుసు వేంకటకవి వేమగిరి.

# దైవప్రార్థన

సీ. నీనామస్మరణను నిత్యంబుబల్కుట పాపమాతంతముల్ బాధగల్గె
నీసన్నిధికినేగు నిత్యభక్తుడు గాడటంచు నాపాదమున్ బాధవెడితి
నీమీదపద్యముల్ నిర్మింపడంచునాకుడిహస్తమున్ నిటుల్ గూర్చితౌర
నీనమస్కారముల్ నిత్యంబుజేయని హస్తమదేలని నడచితౌక్కా

గీ. తమదు బిడ్డలొనర్చెడి తప్పిదములు, తండ్రిమన్నించకిట్టుల దారుణంపు
బాధలను బెట్టి హింసింప పాడియగునె, దైవమా నీవెరుంగనిధర్మమెద్ది.

సీ. దంతముల్ బాధకే తహతహపడి నిన్ను వర్ణింపగాలేక వదరుచుండ
నేడాదిగాలేదు నెడమపాదమునీలబాధపెట్టితి వదిబాయకుండ
క్రూరబుద్ధితో నేడుకుడిహస్తమునునిటుల్ విరుగుగొట్టుటనీకువేడుకైన
నిన్నువర్ణించుట నిన్నుదర్శించుట నిన్ను ధ్యానించుట నిష్ఫలములు

గీ. యనుచుభక్తుల కెంతయు నవనిమీద, జాటిజెప్పెద నీభక్తి సల్పకుండ
దైవమానీవునాయెడనుదయనుదప్పి, హస్తమిటుబాధపెట్టప్రశస్తమొక్కొ

ఉ. నేటికి నైదురోజులయె నేనెటు బాధసహింతు నక్కటా
జాటుమ నీదు దుర్నయము జాలముజేసిన కృష్ణనిప్పుడే
పోటును మాన్పి హస్తమును బ్రోచిననీకునమస్కరింపుచున్
సాటియెలేరు దైవముకు జాలిన రక్షకుడంచు జెప్పెదన్.

ఉ. నెంతయు సవ్యహస్తమున నేనులిఖించెడు నీదుపద్యముల్
నంతయుబొంది దుఃఖమున వ్రాసితి నాదగు వామహస్తమున్
సంతసమానె నీకిదియు శాస్త్రవిరుద్ధముగాదె శ్రీహరీ
పంతముదీరెనే నిటులభక్తుని బాధసహించి చూడగన్.

ఉ. నాయెడదప్పుయున్న యిది న్యాయముగాదని మందలించి
నాకీయెడ సాయమాచు దగుహీనతబాపుట యొప్పుగాని
నీవేయిటు ఘోరబాధలను యేర్పడజేయ భరించుటెట్లికన్
బాయగజేయు మా వెతలపాలుగ జేయక కృష్ణ మ్రొక్కెదన్.

12—12—34
రాజమండ్రి

ఇట్లు భక్తుడు,
బులుసు వేంకటకవి




# యామినీపూర్ణతిలక

అను

# బిల్హణీయము



## నాంది

సూత్రధారుడు:—(ప్రవేశించి)

ఉ. శ్రీవిలసిల్ల వక్షమున శీదలదృష్టిఁ గృపార్ద్రచిత్తుఁడై
యీ వసుధాస్థలిన్ గలుగు నెల్లబుధప్రకరంబు బ్రోచుచున్
పావనసచ్చరిత్రుఁడయి భక్తులకోర్కెలొసంగునట్టి యా
దేవుడు మీకజస్రమును దీవరశర్మము నిల్పుగావుతన్.

(పుష్పాంజలిజల్లి) ( సభ్యులవంక దిలకించి) ఆహా! యేమి! మదీయపుణ్యవశంబున, అఖిలశాస్త్రనేత్తలయిన విద్వాంసులును, తర్కమీమాంసా ప్రతివాదముసేయు, శాస్త్రజ్ఞులును, నవరసాలంకారకావ్య ధురంధరులైన కవిశ్రేష్ఠులును తుంబుర,. నారదాదులను దిరస్కరించు వైణికోత్తములునుగల యీసభఁ జూడ నామనంబెంతయు నుల్లసిల్లుచున్నయది నేటిదినమున వీరి నెట్టినాటకమాడి సంతసింపఁజేయఁగలమో తెలియఁబడదు.

(తెరవంకజూచి) అయినను మదీయప్రియసిఁ బిలచి యో చించెద సఖీ! అలంకరించుకొనినపక్షమున నొకసారి యిటు రమ్ము.

నటి—(తెర వెలువడి) ఆర్యా యిదె వచ్చుచున్నదానను.

సూత్రి—ప్రియసీ! నేడింత యాలస్యమొనరించితివేల నేటిదినమందు నీసభాసదులు మనమెద్దియో గొప్పనాటకము ప్రదర్శింతుమని కనుదమ్ములువిచ్చి మనమునం దువ్విళ్ళూరుచున్నారు. ఇంత త్యాసక్తిగల నీసభాసదుల కెద్దినాటకమాడిన మనంబులు పల్ల వించునోయన మనమునం దాందోళనము జనింప నిన్ను రా వించితి.

నటి—ఆర్యా, యిందులకై యింత యోచింపవలయునా? నవరసాలం కార భరితమై శృగార రసమొల్కజేయు బిల్హణీయంబను నాటకరాజం బొండుగలదు. కవులకును గాయకులకును శృంగారమై ప్రధానము గావున నేటిదినమందా నాటకము బ్రదర్శింతము.

సూత్రి—చెలీ, చక్కఁగ జ్ఞాపకముఁజేసితివి మనము ప్రదర్శింపఁబోవు నాటకంబునకు శుభప్రదమగు వసంతఋతువును నీ గానమా ధుర్యంబున వర్ణింపుము.

నటి—చిత్తము. (స్మృతినభినయించి)

కీర్తన.

సఖా వసంతఋతువుసమయము సౌఖ్యమాగదా ॥స॥
యహా, యదేమొ మెండినమావ్రికులె చిగిర్చె హా ॥స॥
శుకపిక నవకోకిలపల్కులును హెచ్చెగాఁ
ఎన్నడులేనట్టి వింతలతలుపూచె హా ॥స॥
కన్నులపండువగోసేయు సొబగు వెన్నెలల్

కన్నెలకిది వెచ్చనిగాడ్పులను మించెగా ॥స॥
విరహిణులకు గోర్కెలుమది విస్తరిల్లెగా
పాంథులకును బాటలెంతో భద్రమయ్యె హా ॥స॥

సూత్రి—ఆహా! చెలీ, నీ గానమాధుర్యంబున నెండిన మ్రాకులు సహితము చిగిర్చె శిలలు నీరై ప్రవహింపఁజొచ్చె ప్రియా యీనాటకమును రచియించినకవి యెవ్వరో జ్ఞప్తికిరాకున్న యది నన్ను పరిహాసింపక కొంచెము దెల్పుము.

నటి—ఆర్యా, గీ. కలఁడుగా శేమనూరున గౌతమముని
గోత్రజుఁడు పండితవిధేయ మిత్రుఁడనగ
నవ్యకవియొప్పు వేంకట నామధేయుఁ
డతఁడు రచియించె దీని న త్యాదరమున

సూత్రి—ఆ దెలసె యీకవి

ఉ. వయసున బిన్నయయ్యు నిది వ్రాయగనెట్టుల బూనెనొక్కొ ని
శ్చయముగ వ్రాసెనా! యనెడు సంధియమేల వినుండు సత్కవు
ల్దయకును బాత్రుడై మిగుల ధన్యతజెంది కవిత్వమల్లుచున్
భయమునువీడి జేసెనిది భక్తులకెద్ది యసాధ్యమారయన్.

నటి—ఆర్యా, యిక్కవి కవిపుంగవులకు మిత్రుఁడై, వారికరుణాకటాక్షప్రాప్తిచే, విశేషపాండితి లేకున్నను సూక్ష్మబుద్ధిఁగలవాఁడై దీని రచియించియుండినట్లు తోచెడిని.

సూత్ర—ఆ అవును ప్రియా! మదనాభిరామనృపతి కొల్వుకూటమునకు విచ్చేయునట వలయుపాత్రలను సిద్ధముచేయవలయును. పోవుదమురమ్ము.

(అందరు నిష్క్రమింతురు.)

---



శ్రీరస్తు.

యామినీపూర్ణతిలక

అను

# బిల్హణీయము

ప్రథమరంగము.

—:o:—

## ప్రథమాంకము.

స్థలము—సింహపురాధీశ్వరుని మందిరము.

(మదనాభిరామనృపతి సింహాసనుసీనుఁడై యుఁడ మంత్రి వసంతుఁడు, గొందఱు సభ్యులు ప్రవేశింతురు.)

మదనా—అమాత్యశేఖరా!

చ. పసితనమందు బిడ్డలకుఁ బాలును నుగ్గునుఁ బోసి పెంచి సం
తసమున నెత్తిదించుచును దాదులచెంగట యాట నేర్పుచున్
పసిడిమెఱుంగు టందియలు బాదములందున మోఁయు గజ్జెలుచర్‌
వెస నమరించి పెంచుదురు వేడుకతో తలిదండ్రులెంతయున్.

గావున అస్మత్కుమారీరత్నంబగు యామినీపూర్ణతిలక సర్వాంగసౌష్ఠవముఁగలదియై యసమానరూపురేఖావిలాసంబున పూర్ణిమాచద్రబింబాన్వయన నొప్పుచున్నయది. యిట్టి చక్కదనంబుల

కిక్కమైన యక్కల్కిమిన్నకు విద్యాభ్యాస మొనర్చినయెడల సమస్తవిద్యలనుఁ జదివి సర్వజ్ఞురాలై పదియారువన్నె బంగారు నకుఁ దావిగలిగినభాతి సకలసద్గుణరాశియై యుండఁజూచెడు భాగ్య మెన్నఁడు గలుగునోయని మనంబు పరితపించుచున్న యది. ఇందులకు నీయభీష్ట మెద్దియో తెల్పుము

వసంతుఁడు—ప్రభువరా! సమస్త వేదశాస్త్ర పారీణ్యులును, సకలస ద్గుణసంపన్నులును, సమస్తసామ్రాజ్యవిభూతులును నగుదేవర వారికంటె నే నెక్కుడు చెప్పున దేమున్నది. అయినను—

చ. చదివినయంతమాత్రమునఁ జక్కని జ్ఞానముఁగల్గు దానిచే
సదమలబుద్ధియున్ బోడము సద్వినయం బది యంకురించి యు
న్మదమణఁగించు మంచియను మార్గమె బోవఁగఁ జూచఁగాన హా
చమువున కెంతయో విలువ సత్యముఁ జెప్పఁగఁజాల భూవరా!

అదియునుం గాక,

ఉ. రాజ్యములందు పూజ్యతమె రాజుల కెందునుఁ గల్గుఁగాని సా
మ్రాజ్యముఁ బాసిపోవఁ బెరరాజ్యములందున నున్న నెవ్వరున్
భోజ్యమునైన బెట్టరట పూజ్యుఁడు సత్కవిపద్యుఁడెల్ల సా
మ్రాజ్యము నేలు భూపతులు మాన్యుఁడటంచు నమస్కరించుటన్.

'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' అను న్యాయము గావున సర్వవిధంబుల సక్కన్యారత్నంబునకు విద్య గరపించుటయె శ్రేయస్కరము విద్యాధనమువంటి ధనము వేఱొండు గలదే?

(ప్రవేశము, కేశవశర్మ నారాయణభట్టును అను నిద్దరు బ్రాహ్మణులు) అందఱును—లేచి నమస్కరింతురు.

రాజు—(వినయముతో) భూసురవరులారా! నమస్కృతులు.

బ్రాహ్మణులు—శుభమస్తు. సకలమనోభీష్ట సిద్ధిరస్తు. సమస్తసామ్రా జ్యవైభవ ప్రాప్తిరస్తు

రాజు—మహాత్మా ! మీరలీ రత్నపీఠముల నలంకరింపుడు.
అందఱు—(గూర్చుండురు.)
రాజు—మహాత్మా ! మీ యాశీర్వాదఫలంబున మా కజేయమ్మగు
కీర్తి గల్గుఁగాక. అస్మదభీష్టము లీడేరుగాక! ఆర్యులారా యిం
తదనుక మీరాకకై సామంతరాజులతో కొలువు దీర్చియుఁన్న
వాఁడ,
నారా—రాజా నీవు మారాకకై నిరీక్షించుట కెద్దియో శుభప్రదమగు
కార్య మాలోచించి యుండనోపు.
రాజు—మహాత్మా!

సీ. రాకాశశాంకుని రాకొట్టు నెమ్మోము
మకరాంకుశస్త్రంబు మత్కుమారి
యనుపమ రూపకళావిశేషంబుల
మేటియై పర్ఠిల్లు మీననేత్రి)
కమనీయకోమలకాంతిచే విలసిల్లు
చిన్ని కొ)న్నెల నాదు కన్నెమిన్న
గలదన, నెఱుగరే కారుణ్యమతులార
నా పెన్నిధానంబు నాదు బాల
గీ. యామినీపూర్ణ తిలకాఖ్య నలరుఁ దీని
కిపుడు పంచమ వత్సరంబెసఁగుగాన
శుభదినంబును జూచియు సొంపుగాను
విద్య దాన మొసంగఁగ వేచుచుంటి.

చ. చదువని మూఢవాళికిని జక్కని యూహలు పుట్టకుండు స
మ్మదముగ నుండ రేరికిని మందమతిన్ జరియింతు రెప్పుడున్
మదమునఁ బిన్న పెద్దలును మంచియుఁ జెడ్డయు లేక మాటికి
నది యిది యంచు లోకు లపహాస్యము జేయుఁ గృశింతు రక్కటా.

గావున మత్కుమారికకుఁ గల యజ్ఞానాంధకారంబునకు జ్ఞానోదయం బొనంగెడి విద్యాంజనం బొసంగి సర్వజ్ఞురాలుగా జేయ బ్రార్థించుచున్నాడను.

బ్రాహ్మణు — రాజా! నీవింతిగాఁ జెప్పవలయునా? యుష్మద్వంశంబునకు హితముగోరు పురోహితులముగామా రేపు ప్రాతఃకాలమున మీకుమారికకు విద్యాభ్యాసము ప్రారంభించి సమస్త విద్యలఁ బ్రావీణ్యురాలుం గావింతము.

రాజు — (మంత్రిం జూచి) అమాత్య శేఖరా! యీ భూసురోత్తములకు వేయి సువర్ణంబులనిచ్చి సత్కరించి యనుపుము.

(అందరు నిష్క్రమింతురు)

---

## ద్వితీయరంగము.

---

(మాధవశర్మ — నారాయణభట్టు ప్రవేశింతురు)

నారా — ఓహో! మాధవశర్మా ఎంతపాపం వచ్చిందోయీ, మనకీపాటికీయూరుమీాద ఆశ వదలుకొనుటదక్క వేరొండుపాయములేదు.

మాధ — అయ్యో! నారాయణభట్టుగారూ అదేమిటండోయి వింతగా మాట్లాడుచున్నారు.

నారా — కాలము వింతగా మారుచున్నది. మనరాజుగారి కుమార్తెకు యీచదువు పనికిరాదట కవిత్వంజెప్పించి నవరసజ్ఞురాలుగాఁ జేయుదురట.

మాధ — ఓహో! గొప్పచిక్కేవచ్చినదే మనకూ డడిపోయినది.

ఉ. గోణము కట్టుటాదిగను కొద్దియొ గొప్పయొ విద్యనేర్చి స
న్మానమునొందుచున్ మిగుల మాన్యులమంచు జరించుచుండియున్

గానుక లందుచుంటి మిఁక గల్గునె గౌరవమెల్ల సున్నయా
మానము దక్కడింక నను మానములేదు కవిత్వహీనతన్.

నారా—మాధవశర్మా! మన కేదిదిక్కు. యేరాజుదగ్గరకు పోవుదము.

విదూషకుఁడు—ఓహో! ఏమంటోయి! ఆస్థానపండితుల పని అడుగంటె
నది. ఇఁక మీ రెంతయేడ్చిన ఏమీ లేదు.

చ. చదువది యెంత గల్గినను జక్కఁగ సత్కవి తల్లకున్న మీ
ముదిమి మొగంబు లెవ్వరిక ముందుగరమ్మని బిల్తురయ్య యీ
యొదు లోదులైన గోచులును నొప్పనుబెట్టు విభూతి జూచి రా
జిదివర కెంతయున్ మదిని నెంతటి పండితులంచు నెంచెనో.

ఇఁక మీదొంగవేషములు సాగవు. మా బిల్హణకవి కాలి గోరును బో
లని మీకీ పండితశబ్ద మెందులకు? ఏడువను.

నారా—ఔరా! యెంతలో నెంతపుట్టె రాజుదగ్గరనుండు పరిచరులకే
యింత పలుచనయితి మింక రాజెట్లుమన్నించు? ఇంతకు దైవ
ము సుఖముగా కుడిచి కూర్చున్నవారినిఁ జూచి యోర్వఁజా
లఁడు ఇఁక మనకు ముష్టిచెంబె దిక్కు.

మాధ—నారాయణభట్టుగారూ! కవితాకన్యక పురుషుల కెగాని యంతి
పురిలో వసించు కన్యకల కేలనయ్య ఆడుదానికి ఆడుదానినిఁ
బెండ్లిచేసినట్లు కవితాకన్యక స్త్రీలను వరించునయ్యా? రాజు
కీవెర్రిగాని

నారా—అబ్బునో? అబ్బదో? యీ విధవగోల యెవరికి దెలుసును,
కవిత్వం లేకున్న రసికత్వ మబ్బదట అందుచే నవరసికురాలను
జేయనెంచి బిల్హణకవిగారిని రప్పించునట చెట్టు చెడెడికాలము
నకు కుక్కమూతిపిందిలన్న సామ్యముగా నీరాజున కేదో కని
పెట్టుకున్నది. కాకపోతే నిట్టి యాలోచన పుట్టదు.

మాధవ—అవును పిల్లపిల్లతరములనుండి తనయాస్థానములో కనిపెట్టు

కొనియున్న మనలను దక్కువగా జూచుట రాజునకు శ్రేయస్కరమా ?

నారా—యీ విధనకవిత్వం పూర్వం భోజరాజుకాలమునుండి ఆస్థానమువారికి చేటుదెచ్చి దమ్మిడీచేయని ధగ్గీకొడుకులను పాత్రాపాత్రము లెఱుగక రాజులు నెత్తిమీదెక్కించుకొనుచున్నారు.

మాధవ—అవును పూర్వము గాడిదెలనుగాయు కాళిదాసును భోజరాజెంతయు గౌరవించి యాహితాగ్నులును నాస్థానపండితులునైనదండి భవభూతులను దక్కువగ చూడలేదా.

విదూష—ఓహో మీకర్మము ఆలా యేడిసిందనుకోక వాళ్ళని వీళ్ళని అంటారెందుకయ్యా! యీపాటికి నడవండవతలికి నేనుకూడా భోజనానికిపోయి మీదీనదశఅంతా రాణీగారితో చెపుతాను లెండి ఏచాటునోమాటునో నేనుకూడా యింత పారవేస్తాలే పొండి. (దండాలండి)

(నిష్క్రిమింతురు.)

---

## తృతీయ రంగము.

---

(స్థలము—కొల్వుకూటము.)

(మదనాభిరామరాజును, మంత్రియు, నింకగొందరు సభ్యులును)

రాజు—మంత్రిశేఖరా! మత్కుమారి యామినీపూర్ణతిలక విద్యావంతురాలై మాకులంబునకు వన్నియ దెచ్చినది.

సీ. సర్వశాస్త్రములెల్ల జక్కఁగా జదివెను
వ్యాకృతియందున వన్నెకెక్కె
తర్కమీమాంసల ధన్యురాలయ్యెను
యభినయశాస్త్రమం దధికురాలై

భరతశాస్త్రమునందు బ్రాహ్మీణ్యురాలయ్యె
వేదార్థములనెల్ల విప్పిజెప్ప
వీణకేలనుంబూని వీణల విందుగా
భారతియోయన బాడుచుండు
యన్నిటను జాల యోగ్యురా లయ్యెగాని
సరససాహిత్యవిద్యను జదువకున్న
ప్రౌఢగాఁ జాలదనిమెంతు ప్రాజ్ఞులైన
సత్కవినిజూడుమా మంత్రిసత్త మిపుడు
గీ. గాన విద్యకుదగినట్లు కవితయున్న
భారతిని బోల్పగావచ్చు బడతిమిన్న
కేదియును గొఱగాదను మోదమపుడు
గల్గు నా మనశ్శాంతియు గల్గునపుడు.

వసం—ప్రభువరా! దేవరయాజ్ఞ శిరసా వహించుచున్నాడను. మన పురమందు మల్హణ, బిల్హణులను నిర్వురు కవులు గలరు. వారిలో బిల్హణుఁడు చతుర్విధ కవితాధురంధరుఁడై సుధారసధారలొల్కు మృదుమధురకవిత్వ ప్రౌఢిమమెఱసి కవిసార్వభౌమ బిరుదమంది కవీంద్రసంతతికి మేటియైయుండి శిలవైనచో నక్కవిశిఖామణినిటకు దెప్పించెదను. ఓరీ, యెవడురా అక్కడ.
చారుడు—(ప్రవేశించి) మహాప్రభూ నేను సమయస్ఫూర్తినండి.
వసం—సమయస్ఫూర్తీ సమయమునకు నీవే వచ్చినావుగద.
ఉ. అల్లదె సంస్కృతాంధ్రముల కాలయమై విబుధప్రకీర్ణమై
కొల్లలుగాగ శిష్యులను గూడి కవిత్వవిశేముషీ
సల్లలితప్రభావుడయి సత్కవివర్యుడనంగ నొప్పుచున్
మెల్లకవిత్వసంతతుల కేళిక బిల్హణుడం చెలుంగుదే;

నీ వక్కవిచెంతకుబోయి రాజుగారి శలవైనదని యొక్కసారి దర్శనమి
మ్మని తోడ్కొనిరమ్ము.

సమయ—చిత్తము (అని నిష్క్రమించును)

రాజు—మంత్రిసత్తమా అక్కవిశిఖామణి మన యాజ్ఞచొప్పున నేతెం
చి అస్మత్కుమారికకు కవితాశక్తిఁ గఱపునె, కవితాకన్య రస
జ్ఞతపురుషులకెగాని యంతిపురిలోనుండుస్త్రీలకేలయని హెచ్చ
రింపకుండునే.

విసం—ప్రభువరా! అట్లు దలంపవలదు. పూర్వము.

ఉ. భోజకుమార్తెయున్ మిగుల బుద్ధివిశేషముచే కవిత్వమున్
దాఁ జతురత్వ మేర్పడగ దద్దయు జెప్పఁగలేదె? మొల్లయున్
పూజితుతాలనంగ భువిమోక్షముగోరి కవిత్వవైఖరిన్
యోజ రచింపలేదె? యొక యోగినియై రఘురాము సత్కథన్

కావున పూర్వమునను విదుషీమణులకు గవిత్వముండుట గలదు. 'కవి
గానిచో గవిగాంచునే గదా' యను నార్యోక్తి వినమె. కవికిసమ
స్తసంగతులు గోచరమైయుండు. మరియు,

చ. చవియునులేని భోజనము చాతురిలేని నరుండు నిత్యమున్
జెవులను రామకీర్తనలు జేకొని గ్రోలనియట్టి కర్ణముల్
రవిశశికాంతిలేనిది రాత్రిములున్ రతిలేనిజన్మముల్
కవితయులేని నోరుకుల కాంతలులేని గృహంబు వ్యర్థముల్

విదూ—ఆ ఆ ఆగండి. మూడవపాదాంతము జ్ఞప్తిగావుంచుకోండి మ
ధ్యాహ్న ఘంటారావము మోగుచున్నది. భోజనమునకు లేవండి
నాకు కడుపుమండుకపోతూన్నది. మీరెంతసభలుచేసి యోచిం
చిన దైనమొకటి యోచించుచుతెండి నేను వంటశాలకు బోవు
చున్నాను.

(అందరు నిష్క్రమింతురు)

## చతుర్థరంగము.

---

(శిష్యగణంబులతో బిల్హణుడు ప్రవేశించును)

చారుడు—(ప్రవేశించి తనలో) ఆహా! యేమి మదీయపూర్వజన్మ సుకృతంబున యిక్కవిశిఖామణి దర్శనంబలవడె. ఈకవిసార్వభౌము నకుగల యున్నతపదము మహారాజులకును గలదె? ఎచటజూచిన సరస్వతినిలయంబై వేదాంతశ్రవణ రమణీయంబై, శృంగారనాటకాలంకార భావయుక్తంబై, వ్యాకరణలక్షణ పరిశ్రమంబై, జదువువారును, వ్రాయువారును, గమనించువారును గల శిష్యబృందంబులగూడి యెప్పెడి బిల్హణకవి చెంతకేటులబోయి నమస్కరించ గలుగుదును. నాసమయస్ఫూర్తి మాటలిచట పనికివచ్చునే? అయినను నమస్కారములు, పండితుల కెందములుగ రసికపక్షేయక్షుం డునే? (లోనికింజని) మహాత్మా! కవిసార్వభౌమా! నమస్కారములు.

బిల్హ—ఓరీ! యెవడవురా! నీవు

చారుడు—(తత్తరముతో) నేను మదనాభిరాజుగారి చారుడను.

బిల్హ—ఎందులకేతెంచితివి?

చారుడు—(చెవుడుచే వినబడక) మందులుతేలేదండి.

బిల్హ—అరె! ఏమి పనిగల్గి వచ్చితివిరా.

చారుడు—నేను మంగలోణ్ని గానండిబాబు మీకు పనిచెయ్యడానికి.

బిల్హ—నాపని నీకేమికావలెనురా!

చారుడు—శ్రీహరీ! (లెంపలువేయించుకొని ముక్కుమీద వ్రేలుపెట్టుకొని) మీచేత నేను పనిచేయించుకోనాండి. ఎంతమాట శెలవిచ్చినారు.

శిష్యు—(సవ్వుచు దగ్గరకువచ్చి) ఎందుకువచ్చినావు (అని వ్రాసిచూపును)
చారుడు—(చూచి) రాజుగారు దర్శనం యిమ్మన్నారండి.
శిష్యు—ఎందుకోఅకో? (అని వ్రాయును)
చారుడు—ఏమోనండిబాబు గొప్పపండితులుగదాండి ఎందుకు రమ్మన్నారో ?

(అందరు నిష్క్రమింతురు)

---

పంచమ రంగము.

---

స్థలం-కొల్వుకూటము.

(బ్రాహ్మణునితో చారుడు ప్రవేశించును.)

చారుడు.—జయం జయం మహారాజా,
వసం—కవిగారిని తీసుకొనివచ్చితివిరా
చారుడు—చిత్తము వచ్చారండిబాబు గుమ్మంకాడ వున్నారండి.
వసం—(లేచి) కవిసార్వభౌమా! నమస్కారములు విచ్చేయుడి.
బ్రాహ్మ—శుభమస్తు. సంకల్పసిద్ధిరస్తు రాజకటాక్ష ప్రాప్తిరస్తు.
రాజు—(లేచి దవ్వులనున్న బ్రాహ్మణునిగాంచి) యీరత్నపీఠము నలంకరింపుడు.
బ్రాహ్మ—చిరాయిరస్తు. సగలసామ్రాజ్యవైభవ ప్రాప్తిరస్తు.
రాజు—ఆర్యా ! కవిశిఖామణి ?

గీ. సకలసామ్రాజ్యవిభవముల్ చదువు సాటి
రావు, మణిభూషణంబులురావు, మరియు
రూపమందున మన్మథరూపులైన
చదువు లేకున్న నెవ్వరు సరకుగొనరు.

చ. చదివెను వేదశాస్త్రములు చక్కని బుద్ధివిశేష మొప్పఁగా
 చదివెను తర్కశాస్త్రములు సర్వజనుల్ నుతియింప గానమున్
 సుదతియుఁ బాడఁగాఁ గలదు సూనృతమేఁ దగఁబల్కు నెప్పుడున్
 చదువగలేదు నింక కవిసత్త్వము నేర్పఁడి సత్కవిత్వముల్.

బిల్హ—రాజా! నీచెప్పినచొప్పున నీ బాలికామణికిఁ గవిత్వ మలవడఁ జేసి ప్రోత్సాహ గావించెదను. మాకు మధ్యాహ్నసమయమైనది శలవొసంగుఁడు రేపు ప్రాతఃకాలమున విద్యాప్రారంభము కావింతము. మీరును కొల్వు చాలించి మజ్జనశాల కరుగుదురు గాక!

రాజు—చిత్తము. (మంత్రిం జూచి) అమాత్యశేఖరా! కవిగారికి సువర్ణమంత్రపుష్పంబుతో తాంబూలమునిచ్చి సత్కరించుము.

వసం—చిత్తము. (బిల్హణీయునికి తాంబూలమునిచ్చి పంపును.)

రాజు—(తనలో) ఓహో! యేమి, యీకవియొక్క తనువిలాసము నవమన్మథాకారుని మించియుండెనే? మనకోరికకు భంగము కలుగదు గదా? మంత్రిసత్తమా!

ఉ. యీకవిమన్మథుఁగనిన యింతులు మన్మథతప్తగాత్రులై
 తా కఠినత్వ మూనుదురే తద్దయు పైఁ బడ జూచుఁగాని నే
 నీ కవిశేఖరుల్ బిలచి నేర్పఁడీ సత్కవితంబటంచు హా
 వాకొనినాఁడ యింతులను వంటరిగా విడనాఁడు టొప్పునే.

మంత్రి! యెంత మోసము వచ్చెను. అస్మత్కుమారియు అసమాన రూపురేఖావిలాసవతియన జగద్విఖ్యాతితంబు. బిల్హణుండును రూపజితమన్మథుం డన నొప్పుచున్నవాఁడు. యిట్టి సౌందర్యాతిశేకంబులనొప్పు స్త్రీపురుషుల నిర్వుర నొకచోటనుంచిన ముప్పు వాటిల్లకుండునే? బిల్హణుండు తానెంత గురువుగారైనను, మత్కుమారిక తానెంత శిష్యభావముతో వర్తించినను, నిర్వుర

డెందంబులు మన్మధుఁడు గలంచి, చిత్తవైకల్యము గావిం చకుం డునె? పూర్వముబృహస్పతి తారనుతనకత్యంతప్రియశిష్యుండై యొప్పెడి చంద్రుని సహాయార్థ మింటనునిచి, తాను యజ్ఞార్థ మేగి క్రిమ్మఱ వచ్చునంతలో నెంతలుపుట్టెనో మన మెల్లర మెఱింగి నయంశమేగదా! విద్య లేకున్నను మర్యాద నిల్పనేఁ జాలదె? ఎట్లయిన నీకవిచెంత విద్య చెప్పించుటకు నా మనస్సెంతయు నొప్పకున్నయది.

వసం—దేవా! మీరలే యిట్టులోచించిన, మీ దలంచినకార్య మెట్లు తుదముట్టు. మీకుమారికకు విద్యాకొఱఁతయు నెట్లుదీరు. యిం దులకుఁ దగిన యుపాయ మొండుగలదు. వీరిపూర్వరకు చెరి యొకవ్రతముఁ గలదు. మీకుమార్తె పుట్టుగ్రుడ్డినను జూడదు. ఆయన కుష్ఠుగాత్రునిఁ జూడఁడు గావున,

మ. కవి జాత్యంధుఁ డటంచుఁ బల్కి కలదా కంజాక్షికిన్ శ్వేతమం
చు, విరోధంబుగ తద్వ్రతంబులకు చోద్యం బొప్పగాఁ జెప్పినన్.
భువి నన్యోన్యవిలోకనంబు లపుడుర్ భూపాల దా రొప్పమిన్
కవికిన్ కన్యకు మధ్యగా నొకతెరర్ గట్టించి చెప్పింపుఁడీ.

అట్లు జేసిన సర్వోత్కృష్టంబై యుండు అంతియేగాని విద్య మానిపించు ట యంతమాత్రము మంచిది కాదు.

విదూ—అవునుబాబు అట్లనే చేయించండి, కొద్దిరోజులలో యామినీ పూర్ణతిలకను, ఆయన విద్యాభిషిక్తురాలుగఁజేసి ప్రౌఢరాలుగ జేయఁగలఁడు. తగిన గురువులేక యింతవరకు మాటనేర్పరి కాలేదు. ఇఁక అన్నిట మిన్న కాఁ గలదు.

రాజు—మంత్రిసత్తమా! నీవెంతటికైన జాలినవాడవు నిన్నెంతని బొగ డువాడను, నీవంటి మంత్రాలోచనపరుఁడుండ నాకోరిక సఫ లము కాకుండునే? నీచెప్పిన యాలోచనవలన అస్మత్కుమా

రిక ధన్యురాలయ్యెడుగాత. సకలలక్షణ శాస్త్రములను జది వించి కవిత్వమం దధికురాలనుగాజేయు భాగ్యము నేటికిగదా కొనసాగినది విద్యాశాల రేపటికి సర్వాలంకారముజేయునట్లు పరిజనుల కాజ్ఞాపించుచును.

(అందరు నిష్క్రమింతురు)

---

## షష్టమ రంగము.

---

స్థలం—విద్యాశాల

(మదనాభిరామనృపతియు,వసంతుడుమరికొందరు సభ్యులు ప్రవేశింతురు బిల్హణుడుబాలరామాయణాదిగ్రంధములతో విద్యాశాల కరుదెంచును)

రాజు—(లేచి) కవిసార్వభౌమా! నమస్కారములు. యీరత్నపీఠ మలంకరింపుడు.

బిల్హ—శుభమస్తు. సకలసామ్రాజ్యవైభవ ప్రాప్తిరస్తు. తథాస్తు. (అని పీఠముపై గూరుచుండును.)

రాజు—మహాత్మా! అస్మత్కుమారిక-

గీ. సకలసద్గుణములదొంతి చంద్రువంటి
ముఖవిలాసంబుగల్గిన ముద్దుగుమ్మ
గాన విద్యనునేర్చిన కల్కిమిన్న
మానమే ప్రాణపదముగ మనెడుసాధ్వి.

యిట్టి బాలామణికి సృష్టికర్త దాను, గాత్రమునందొక్కింత స్వేతబిం దువును వదలి సృష్టించె తమకొకవ్రతమున్నదని విని వ్రతభం గము గలుగకుండ ముందుగనే మనవిచేయుచుంటిని.

బిల్హ—ఓహో! బాగామెనే రాజా! నేనట్లయిన మీకుమార్తెకు విద్య జెప్పుట బహుప్రయాస మరియొకకవిచే జెప్పింపుము నేనిదే బోయివచ్చెదను. (అని లేచి వెళ్ళబోవును)

రాజు—ఆర్యా! మీరట్లు శలవిచ్చిన నాప్రియత్న మీడేర్చువారెవరు యింతమాత్రమునకై తమరు వెడలిబోవ యత్నించుచుంటిరే. అందుకు దగిన ప్రయత్నమేదేని మంత్రితో యోచించి, దాని కనెరవేర్చుకుందును. యొక్కింతడవు తొందరసేయక విశ్రమింపుడు.

బిల్హ—అట్లయిన మంత్రితో యోచించి యామినీపూర్ణతిలక నిటకు రప్పించుడి. ముహూర్తము సమీపించుచున్నది.

రాజు—మంత్రిసత్తమా! నేనంతిపురికేగి యామినీపూర్ణతిలకను దోడ్తెచ్చెద. కవిగారి యనుమతిప్రకారం యిందుకు తగిన యుపాయమాలోచించి సిద్ధముసేయుము.

వసం—చిత్తము. (నిర్వరపరిచరులకు తెరపట్ట యాజ్ఞాపించును)

తెరపడును.

---

సప్తమరంగము.

---

స్థలము అంతఃపురము

(యామినీపూర్ణతిలక, రాజుప్రవేశము ప్రవేశము)

రాజు—అమ్మా! పూర్వజన్మ సుకృతంబున లేకలేక నిన్ను వరప్రసాదంబున గని మాకులమునకు కీర్తిగంటిని. నీకు సకలశాస్త్రములను జెప్పించియుంటిని. గాన విద్యను ప్రవీణ్యరాలవైతివి. యిక కవిత్వవిద్య నొక్కటిదక్కవనై యున్నది. నేటిదినమందున చతుర్విధ కవితాదురంధరుడైన, బిల్హణకవిగారిని ధావించి నీకు కవిత్వదానంబొసగ ప్రార్థించితిని. యింతకు ఆ

యనకు సరస్వతి కటాక్షించి జిహ్వాగ్రమందు నిల్చియుండుటకు కారణమేమన? భర్తయగు బ్రహ్మ బిల్హణుని సృజించునపుడు నేత్రములు వుంచుట మరచినందున యక్కవి జాత్యంధు డయ్యె. భర్తజేసిన పొరబాటునకు తానెంతయు కరుణార్ద్ర చిత్తయయ్యె యిక్కవి శిఖామణి జిహ్వాగ్రంబున నిల్చి విశేష శే ముషింగలుగ జేసినది. నీవాకవిచెంత సమస్తలక్షణ శాస్త్రము ములు చింతనజేసి కవిత్వమును నేర్చిన నీకిదివరకున్న వీణాప్రవీ తకును, సాక్షాత్తు సరస్వతియేయన, విద్వజ్జనంబు లుగ్గడింప ఆ నందమహాబ్ధిని నోలలాడగలవాడను, గావున యీరోజుననే క విత్వమారంభించుటకు విద్యాశాలకు కవిగారిని రప్పించి, మంత్రి సామంతరాజ భృత్యవర్గంబుల నటసిద్ధము జేసియుంటిని. శీఘ్ర ముగ లెమ్ము. కీర్తినిదెమ్ము.

యామి—తండ్రీ నీవిటులజేయుట కెంతయు సంతసించుచున్న దానను, అయినను నాకుగల వ్రతము నీవెఱుగని కతమున అక్కవిచెంత కవిత్వమునేర్ప యత్నించితివి. పుట్టుగ్రుడ్డిని జూడనను వ్రత మొకటి నాకుగలదు. గాన యిదెట్లు సిద్ధించును. మరియొకకవి చెంత అయిన కవిత్వమునేర్చుకొనియెద. అందుకు సమ్మతించి వేఱొకని నియమింపుడు,

రాజు—కుమారీ! అట్లనకు. యీకవి నవరసాలంకార కావ్యదురంధ రుడై చతుర్విధకవిత్వము చెప్పనేర్పరి. యీకవిని బోలువాగలీ ముజ్జగంబునలేరు. గాన, ఎట్లయిన యీకవిచెంతనే విద్యనభ్య సించిన త్వరలో ప్రౌఢవై కవిత్వముజెప్ప గల్గుదువు. అందు కుదగిన యుక్తి ఏదేని యోజించి మీయిర్వురు నొకరికొకరు గన బడకుండునట్లు ఏర్పరచెదను. విద్యనభ్యసించుటకు చెలులతో విద్యాశాలకఱుగుము.

యామినీ — అట్లుజేసిన యెంతయు శిరసావహించెద. ఆప్రియత్నమును నూతృము జేయుడి. యిదె చెలులతో విద్యాశాల కరుగుదెంచెదను. (నిష్క్రమించెదరు)

—

అష్టమరంగము.

—

స్థలము — విద్యాశాల.

బిల్హణుఁడు, (మంత్రి, రాజు మొదలయినవారందరు నొక తెరగట్టియుందురు)

యామినీ — (ప్రవేశించి) జనకా! నమస్కారములు. (తెరలోపలనున్న (కవి నుద్దేశించి కవిసార్వభౌమా! గురువరా! నమస్కారములు.

బిల్హ — సుకవిత్వ ప్రాప్తిరస్తు. శుభమస్తు. మనోభీష్టసిద్ధిరస్తు.

విదూ — (తనలో)కవిగారు జరగనై యున్నదానికి యాశీర్వచించినారు యామినీపూర్ణతిలక నమస్కరించుటలో గురు అను రెండక్షరములు తగ్గించి వరా నమస్కారములు అనినబాగానేయుండును.

యామి — (రెండవవైపున తెరదగ్గర పీఠముమీఁద గూర్చుండును)

బిల్హ — అమ్మాయీ! విఘ్నేశ్వరపూజ గావింపుము. యీపుష్పములు గణపతిమీఁద వేయుము, ఓం విఘ్నేశాయనమః ఓం వినాయకాయనమః, ఓంవిఘ్నరాజాయనమః, ఓంఏకదంతాయనమః, ఓం లంబోదరాయనమః, ఓం వక్రతుండాయనమః ఓం గజాననాయనమః, యీ అక్షతలు పుచ్చుకో— యిఁక వాణీపూజ గావింతము పుచ్చుకో—చెప్పు.

క. వాణీ గీర్వాణీ శా

ర్వాణీ యజురాణి విద్యరాణీ దయతో

వేణీలోచినపల్లవ
పాణీ పాకుస్రద్ధిగల్లు వరమిడు తల్లీ !

అయ్యా సదస్యులకు ఫలప్రధానములు యిప్పించిండి, (నారాయణభట్టు నిఁ జూచి) నారాయణభట్టుగారూ ! దయచెయ్యండి, అగ్రజులును, గురువులును కూడాను మీ రయినతరువాత తక్కిన వారిని చూడవచ్చును.

సారా—(తనలో) నా గురూత్వ మేడిసినట్టేవున్నది. నాకర్మం కాలి పోతే, గురుదక్షిణలు, మామూళ్ళు, పట్టుకోనతులు, పుచ్చుకునే నాకు యీఫలప్రధానం రాసిందికదా ! (అని లేచివెళ్లి సణుఁగుకొంచూ పుచ్చుకొనును.)

బిల్హ—మాధవశర్మగారూ ! దయచెయ్యండి మీరుకూడా యీయన తో సమానులే,

మాధవ—(తనలో) యీవేళ ఫలప్రధానంగతి అయినది. రేపటినుంచి పొత్తర్లు మోసుకోవడం తటస్థిస్తుంది. నాప్రారబ్ధం. ఏటుచెయ్యను. నిన్నగాక మొన్నివచ్చిన నీకెంత దశపట్టిందిరా నాయనా ముందువచ్చిన చెవులుకన్న వెనుకవచ్చిన కొమ్ములు వాడిగావా ! అదృష్టవంతుల చేరిపేవాఁడు. నిర్భాగ్యులను బాగు చేసేవాఁడు లేడు. (అని పుచ్చుకొనును.)

(యింకా మరికొందరు పుచ్చుకొందురు)

బిల్హ—రాజా ! రేపటినుంచి ఛందోవ్యాకరణములును, గురులఘువర్ణ వివక్షలుఁజెప్పి కవిత్వం త్వరలో నేర్పి మిమ్మానందపెట్టుచు న్నాఁడను. సభవా రందరికి శెలవియ్యండి.

రాజు—మహాత్మా ! తమవంటి యీశ్వరవరప్రసాదులైన; గురువుగల్లుటచే, నాకొమారిత శీఘ్రముంబ ఆశుకవిత్వమం దధికురాలయ్యెడుఁగాత, ప్రపబంధములు పెక్కులు నిర్మించుగావు త మీకరుణవడసి చిత్రబంధాశ్లేషలం దధికురాలయ్యెడుఁ గాత—

సభ్యులు—తథాస్తు. (విదూషకుఁడుతప్ప అందరు పోవుదురు)

విదూ—ఆహా! రాజుగారు బాగుగానె ఆశీర్వదించుకున్నారు. మీకరుణవడసి చిత్రబంధాశ్లేషలం దధికురాలయ్యెదుఁగాత. అనియూ, అది యేలాగ తప్పదు, రాజు చెప్పినట్లు జేసినప్పటికి తుదకు కవిగారియెడ నిందారోపణఁ జేయుదురు. రాజులకామాత్రం జ్ఞాపకం కూడానా! నే బ్రతికివుంటె అన్నీ కళ్ళార చూస్తాను.

(నిష్క్రమింతురు)

తెరపడును.

ఇది ప్రథమాంకము.






# యామినీపూర్ణతిలక

అను

# బిల్హణీయము



## ద్వితీయాంకము.

---

### ప్రథమరంగము.

---

స్థలం- వనవిహారము.

(కమలాక్షి కీరవాణిఅను చెలులతో యామినీపూర్ణతిలక ప్రవేశించును)

యామి — చెలీ, చూచితె; యీలతామతల్లిక యెంతరమణీయముగా నున్నదో, నిండుజవ్వనులు పుష్పవతులైన తెఱగున నిదియును పుష్పవతియై జూచువారికి గనులు మిఱుమిట్లు గొలుపుచున్న యది (లతనుజూచి) ఓ లతామతల్లికా మేమును పుష్పవతులమైన నెలజవ్వనులమే గావున నిన్నుముట్టిన దోషముండదు. (అని సమీపించి పువ్వులు గోయబోవును)

కమ — సఖీ, ముట్టకు ముట్టకు! మన్మథుడు చెలులపై బ్రయోగించు శస్త్రములుగావా? నేడు మనకును యీలతలకును సఖ్యము

జేయుచుంటివా? పామునోట వేలుబెట్టిన గరవకుండునే? నిరపరాధులమై నొరులజోలికిబోవని ముద్దరాండ్రమగు మనల నీ పుష్పాస్త్రములచేత నేగదా? మారుడు నొవ్వజేయుచున్నా డు. అట్టివానిజోలి కేలబోయెదవు.

కీర—కమలాక్షీ! నీవెంతటిజంతవే నిన్నగాక మొన్నటివరకు మనచెంత యాటపాటలునేర్చిన యామినీపూర్ణతిలక నేడు మనతో వన విహారమునకురాగా లేనిపోని మన్మథవికారచేష్టలు గఱపుచు భయపెట్టుచుంటివా? (యామినీపూర్ణతిలకనుజూచి) నెచ్చెలీ! అట్లుగాదు మన్మథునకు విషమాస్త్రుడనుప్రఖ్యాతి అట్టివిష మాస్త్రములైన యీపుష్పములందుగల విషమును గోధుమ తేంట్లు జుం ఝుంమ్మని ఝుంకారధ్వనులతో చెంగుచెంగున బుఱ్ఱుబుఱ్ఱుకువ్రాలి ఎట్లుగ్రోలుచున్నవో గాంచమయినను జూడలేదా! మనయెడ మహోపకారమొనరించు యాతేటిపిల్ల లను నీవు పుష్పములుగోసి బెదరించినదానవగుదువు. నీకారణంబున మనము కృతఘ్నులమగుటయెగాక మనకై పాటుపడెడి యాతుమ్మెదలకు నాహారమును జెఱపినవారమగుదుము. గాన ఆపుష్పములజోలికి బోకుండుట మనకెంతయు శ్రేయస్కరము.

కమ—కీరవాణీ! నీవు నాకంటెతెలివైనదానవైనను కాదని నీవుజెప్పిన దేమిటి యేమితెలివితేటలేనీవి నీముక్కుదిఅనిన తలపైనుంచి చేయిత్రిప్పి చూపించినట్టున్నది. నీమాటలు నీకె నచ్చవలెను.

యామి—చెలులారా! మన్మథుడు మనకెంతయు బగవాడా అట్లయిన-

చ. మదనుని బూజసేయుదము మానినిగోయవె పూలగుత్తులన్
మదిరినపండ్లు లేజివురుమొగ్గలుపుప్పొడి పట్టుతేనెలున్
కొద్దువల్లునేనెగూర్చెదను గొజ్జగినీటను స్నానమాడి నే

జదివెదనిప్డు మంత్రములు జక్కని మన్మథుగూర్చి వేడుకన్.

(అట్లుచేయబోవుచున్న చెలులచెంతకు చిత్రరేఖ ప్రవేశించును.)

చిత్ర—సీ. ఏలగోసెదరమ్మ యీమావిచిగురులు
కోయిలపిండుకో కోయనంగ
బిసకాండములదుంచ విషమాస్త్రినుజని
హంసతేజికిమేత హానిగాదె?
పట్టుతేనెలుదీయ బాడియేమదనుని
నారియాతుమ్మెద నలుగకున్నె?
ముదిరినపండ్లేల ముట్టిగోసెదరయ్యొ
మరుబలంబులతిండి మాపదగునె?

గీ. చాలు! మదనునిబూజింప సకియలార!
లేనిపోనివిగల్పించి లేమజాతి
కందరికిచేటుదెచ్చెద రంతెగాని
మన్మథుడు జాలిబూనునే మగువలయెడ.

గావున మన్మథపూజపై జెప్పినట్లుజేసిన మనకె మారబాధ సిద్ధించును గాన మనదారిని మనముబోవుట మంచిది.

కమ—అవునే చిత్రరేఖా నేనుచెప్పినను వీరువిందురా వినినను కీరవాణి విననిచ్చునా; అయ్యో! మనపని అయినది.

చ. తన చిగురాకు బాకుమన తావుకుజూపుచు జెట్టుమాటుగా
మనసిజ చోరకుండడుగో మాటలికేటికి మిన్నకుండ నీ
వనమునుబాసిపోవుదము వచ్చెసమీరపు తోడుదొంగ హా
మనమెటు దాచుకోగలము మానధనంబుల కేదిభద్రమో.

ఆహా! ఏమి నేడింత వెచ్చనిగాడ్పు వీచుచున్నయది. మన్మథతాపముచే నొడలంతయు గ్రాగియున్న మనకీసమీర మెటనుండి వచ్చె. కీరవాణీ యింతకూ మీరిద్దరుతెచ్చినచేటుగదా! మన్మ

ధసంబంధమయిన వస్తువులుముట్టిన మన్మథు పూరకుండుట కంత వెట్టివాడా, నీ చనుగుత్తులెవ్వడేని నీయనుమతిలేక ముట్టిన నీ పూరకుందువే ? సాయంకాలమవుచున్నది. త్వరగా నడువుండి యిపుడైన బుద్ధితెచ్చుక నామాటమీఁద అంతఃపురికిఁ బోయిన బ్రతుకఁగలము. లేకున్న నేటి కీయరణ్యముపాలే. (త్వరగా నడుచును.)

కీర—ఏమే ! యింతకూ, నేను నీకు లోకువగా దొరకినదానను.—

యామి—కమలాక్షీ ! నన్నీ వని, డించి నీవు తొంతరగాఁ బోయెదవా? నేను నీమాటకేమైన నతిక్రమించితినా, నన్నుఁగూడ నంతఃపుర మునకు త్వరతముగఁ దోడ్కొని పొమ్మ—

కమలాక్షి—ఏమో ! అమ్మ. నామాట వింటివా ! నాతో త్వరగా రమ్మ.

మ. కమలాప్తుం డల పశ్చిమాంబునిధి దాఁకన్ గాకముల్ గూడె, నా
కమలంబుల్ ముకుళించె, కల్వ లిపుఁ డేకానంత మేల్గాంచె, కా
ర్తిమిరంబంతట నాక్రమించి భయమున్ దీనత్వమున్ జూపె నో
కమలాక్షీ ! యని నన్ను బిల్వకు మురాకాంతా ననున్ జేరఁగన్.

నీకేమి నిక్కి నీల్గి తప్పటడుగు లిడుచు మెల్లఁగ నే తెంతువు, నేబోయి అంతఃపురమున నుండు లైట్లన్నియుఁ బాగుఁజేసి వెలిగించి పిమ్మట నీవు నిద్రించువరకుండి, యింటికిఁ బోవలయును, నీతో నాకు సాటా ? అమ్మా ! (త్వరగాఁ బోవును.)

కీర—సఖీ ! నీకింత భయమేల ? నీఁపాడగా వెళ్ళెదము. పోనీ దాని కంతగర్వముతో వెనుకకైన, తిరిగి చూడకపోయిన నీకు లోటా,

చిత్ర—చెలీ ! మే మిద్దరము నిన్ను మెల్లఁగా అంతఃపురము ప్రవేశ పెట్టగలములే, అయినను త్వరగాఁ బోవుట మంచిది.

చ. విరులను నక్షతల్ గలపి వేడుకతోడుత దిక్పురంధ్రులం
ఒరమున రాజ్యమేలుటకు వచ్చెడు చంద్రుని మీఁద జల్లెనో,
యరయఁగరాదు జూడు సఖియా, యదె, యాకసమంత నెల్లనై,
పసుపగ రిక్క-జా లడుగొ వచ్చె సుఁబల్ నెటజల్లు కై వడిన్.

గావున నింకిట యాలస్యము సేయరాదు, సరగునఁ బోవలయును. అంతఃపురసమీపమునకు వచ్చితిమి, నిఁక రెండుగడియలకు లోపల ప్రవేశించఁగలము పదండి. (అని వడిగబోవుచుందురు)

యామి—(అంతఃపురము సమీపించి, చంద్రోదయముగాంచి, సఖులతో) చెలులారా!

ఉ. అల్లదె తూర్పుభాగమున యత్రికుమారుఁడు చంద్రికాంతులన్
జల్లుచుఁ గెంపుజాయలనుఁ జక్కని వెన్నెల గాయఁ జేయుచున్
సల్లలితప్రభావుఁడగు సద్గురు భార్యనుఁ గూడు నింద, దా
నెల్ల హరింపఁజేయుచును నెంతటికీర్తి వహించి మించెనో.

కీర—చెలీ! వనవిహారంబు సల్పి చాల బడలికతో యిప్పటికి యంతిపురి ప్రవేశించితిమి, ఒక్కింత శ్రమ వాయుటకై, యీమల్లె పందిరికిఁ గట్టిన తూఁగుటుయ్యెలపై గొంచెము విశ్రమింపుము. యింతలో భోజనమునకుఁ బిల్తురు. (అని యామినీపూర్ణతిలకను శయనింపఁజేతురు.)

చిత్ర—కీరవాణీ! యీ రాకొమార్తె యెంత యలసినదో; కనుఁగూర్చునంతలో ఎంతగాఢనిద్ర పట్టినది. సుకుమారశరీర గావున వనవీధుల మనతో తిరిగినందున మిక్కిలి బడలినది.

కీర—చిత్రరేఖా! మాట్లాడకు, మాట్లాడకు, నేదిమో కలవరించుచున్నట్లున్నది.

చిత్రరేఖ— ఓసీ! అట్లయిన లేపుదము, నీకలవరింతవల్ల నేమి యుపద్రవము వచ్చునో? చెలీ! చెలీ! (అని తట్టి లేపుదురు.)

యామి—(తెల్లఁబోయి లేచి నలుదిక్కులు చూచి కన్నులునలుపుచు) చిత్రరేఖా! మన మెచట నుంటిమి (అని అడుగును.)

చిత్ర—నెచ్చెలీ! యేల యింత భయకంపితురాలవై కలవరించుచు నులికిపడి లేచితివి.

యామి—చెలీ! యేమని చెప్పుదును.

ఉ. అమ్మక చెల్లనే నిపుడ హా కలగంటిని కమ్మవిల్తుఁడే
సమ్మతితోడ నాసరస జక్కని చెక్కిలి ముద్దు బెట్టికర్
బొమ్మల చందముర్ గనుచుఁ బోటి కవుంగి లొసంగిఁ బ్రోవగా
రమ్మని నన్నుఁ జీరగను రానని నే నటు ద్రోసి వచ్చితిన్.

ఆ సుందరుఁ డెవ్వఁడో గాని నా మానధనంబు మాత్రము హరించి నా కదృశుఁడయ్యె, అప్పటినుండియు మన్మధతాపము మరింత నెక్కుడై నన్ను కలవరింప సాఁగినది.

చిత్ర—సఖి! ఇఁక నేమి? చక్కని కలగంటివి. నీకును నేడో రేపో అట్టి సుందరునితోఁ గలసి మెలసి మన్మథక్రీడలఁ దేలెడుభాగ్యము చేకూరు ననుటకు ముందుగా శుభసూచకమైన కలగంటివి. నీవా నవమన్మథాకారునితోఁ గలసి మమ్ములఁ గన్నెత్తియైనఁ జూతువో చూడవో?

కీర—చెలీ! నేను నీకు ప్రాణసఖినిఁ గదా. నన్ను మఱచెదు సుమీ!

కమ—(ప్రవేశించి) భోజనసమయ మయినది. లెండు. పోవుదము.

(అందరు నిష్క్రమింతురు)

---

## ద్వితీయరంగము.

---

స్థలము:— సౌధము.

బిల్హణుఁడు మధ్యతెర యామినీపూర్ణతిలక ప్రవేశము
(బిల్హణుడుచంద్రునివర్ణించుచుండును.)

బిల్హ—(చంద్రునివంక దృష్టి సారించి)

గీ. చుక్కలనుఁ జేరి సత్కాంతి సొంపుఁ గులుక
యవ్వనంబున నుండు జనాళి కెపుడు
సతనుతాపంబు మఱికొంత యంకురింప
జేయగాఁ జూచు నల్లదె తోయజారి

ఉ. కాయజు కెంతొ హెచ్చరిక కల్గుగఁజేసి తమంబు వాఁపుచున్
న్యాయముఁ ద్రోసి పద్మముల సన్నిటికాంతి, నడంచి, మక్కువన్
సాయమొనర్చి దేవతల సంఘములన్ దనివొందఁ జేయుచుం
తోయజవైరి యల్లడుగొ, తూగుపునం దుదయించె వేడ్కన్.

చ. విరహిణులెల్ల సౌధముల వీచెడి చల్లని గాడ్పుఁగోరి తా
మరునకు మేనమామ యనుమాట దలంపక శయ్యఁజేరినన్
సురసుర గాఁగఁజేసెదవు సొంపగు నీ కిరణప్రభాళిచే
హర! హర! యింత పాతకపు హానిఁ దలంచితె; చంద్ర యింతులన్.

చ. జలనిధిఁ బుట్టినాఁడ వని జక్కఁగ నిక్కుచునుంటి వౌర ! ప
ర్వల నినుఁ బెద్దపాము పగఁబట్టియు దాఁ దిగమ్రింగనైన మా
నెలఁతలబాధపెట్టుటకు నెక్కడఁ బుట్టితొ, యంచు నిన్ను చా
నలు కడు దిట్టఁగాను యిటు నాటికి నాటికిఁ దగ్గిపోతివో?

లేక- క. ప్రతిరోజు నొక్కరీతిగ
ప్రతిబింబము ప్రజ్వరిలినఁ బ్రతుకగలామే

అతివేడి వెన్నెలకు మా
మతిచెడి భ్రష్టులము గామె మారుని మిత్రా.

చ. అని బ్రతిమాలు జవ్వనులయందున యించుకఁ జాలిఁ బూనితో
దినదిన మెుక్క యంగుళము దేహము పెంచియు క్షీణమౌచు మా
నినులకు పున్నమందు మరునింటను కంపముఁ బెంపుఁ జేయుచుఙ్
నిను గని నల్కపాటుబడ నీవిటు దగ్గుచు హెచ్చుచుంటివో?

సీ. రాజ్యమేలినయంత రాజువా! నీవు రా
జీవాత్ములను నేచ జెడుడవైతి
సద్గుణంబులు నీకుఁ జదివిన గల్గునా
గురుసతిఁ బట్టెడి గుణమె గాని
రే రే డనుచు నీకు రత్తనామమె గాని
విరహుల పాలిటి విషమ వీవు
కమల నీయక్కని ఘనులందు రేగాని
తమ్ముఁడవై గొల్తు తద్గృహంబు

గీ. యంధకారము నడచెడి యధిపుఁ డనిన
పాంథులను యేచుచుండెడి పాతకుఁడవు
యనుచు నెలఁతలు నిన్నెంతొ యడలదిట్ట
వెస నిశాటుండవైతివో విసుగుఁ దోచి.

మరియు,

గీ. కమల నీయక్కట నామె గన్నతండ్రి
నీకుతండ్రిట యిదియంత నిజముగాదె?
పౌర్ణమంటున వారినే పాడుసేతు
వితరులా! నీకు హితులౌట (శీతకిరణ) సితమయూఖ.

క. ప్రతిదిన మెుక్కరివంతుగ
యతులిత నీతేజమెల్ల యాదేవతలా

కృతిమాత్రి మించి తినగను
బ్రతిమాలగ బోలునీవు బ్రతుకగమరలన్
సీ. అంతంబులేని వాడయ్యె నీజనకుండు
అందరి కాధార మగునుదల్లి
నిఖలసంపదలిచ్చు నెమ్మినీతోబుట్టు
నిఖలంబుతానేలు నీదుబావ
విరహులబాధను వీడగొట్టును నీదు
యల్లుండు విల్లంధి యతనుడైన
ఘనసస్యసంపద గాంచునీమింతురిందు
విబుధుల కొసగుదు విందునీవు
గీ. తిమిరమును బారదోలు నీదివ్యతేజ
మొకకళంకముదక్క నీకొండు గలదె?
శీతకిరణుండవని నిన్ను శిష్టజనులు
జయము నెట్టంగ జాలదే చంద్రనీకు.

ఆహా! యేమి! యీనిండుపెన్నెల ప్రభావంబుచే సకలజనానందంబుగల్గె అంధకారబంధురంబగు అడవిజంతువులు తమయాహారార్థము గుహలు వెలువడి జరించు, యీమహాత్ముని కిరణములనే యని మిషపతులాహ్లాదంబున వీందారగించి తృప్తులయ్యెదరు. కన్నుల పండువగు నీవెన్నలగాంచి, నిశాచరులెల్ల తాము బైయలు వడుట కెంతయు, దిగులొందుదురు. యీమహామహుని శీత కిరణంబులచే, యీప్రపంచమున గల సమస్త సస్యము వృద్ధిచెంది నానాటబెరుగును. అయిననేమి! విరహులపాలిటి మృత్యు దేవతయయ్యె.

యామినీ—ఔరా! యేమి యీకవిశిఖామణి జాత్యంధుడని, మాతండ్రి మొదటనే జెప్పియుండె యిపుడన్ననో నిండువెన్నెలచే నొప్పా

రు చంద్రమండలమును గూర్చి జూచువానికన్న నెక్కువగ వర్ణింపజొచ్చె హా! కవిగారునొక వేళగుడ్డివాడై నను, వర్ణించె నన, స్పష్టముగ తానిప్డు జూచుచు వర్ణించుచుండిన ట్లుండె,

శా. ఔరా! యేమి! మహాద్భుతంబిది నిజం బాశ్చర్యము౯ గొల్పదే
రేరాజేడను యంధుడేడ గనెనా? రేయెండ తానెంతయున్
మారాజిట్టుల మాయపన్నెనొకొ యీమారాకారమున్ గాంచి న
య్యా రే! వింతయితోచె వేరుగలదే? యడ్డంబిదేలా యిక౯

(అని తెరవంచి) కవినిజూచి ఆహా! యేమి యీ నవమన్మథాకారము. కనులు మిఱుమిట్లు గొలుపుచుండెనే (అని మూర్ఛబోవును)

బిల్హ—(యామినీపూర్ణ తిలకనుజూచి సంభ్రమాయత్త చిత్తుండై ముఖబింబ మవలోకించి)

సీ. యీచంద్రమండలం బేసాటిసరివచ్చునీరామముఖ బింబ మీసడించు
యీరామకనులతో నేపాటి తులతూగుమరుని నారాచముల్ మాయమగును
యీభామచనుగుత్తు లింపార బోడగన్నబంగారుకలశముల్ రంగుచెడును
యీలేమతనుకాంతి కేపాటిసరివచ్చుదొలకరి మెఱుపైన దొలగిపోవు

గీ. నహహా! యీచానగానునేత్రనూహజేయ
జాలజక్కని నూగారు సొరుచూడ
యాదిశేషుడె యిటువచ్చి యలమికొనెనో?
యేమి జెప్పుదు యీభామ నెప్డుజూడ.

ఉ. దీనిముఖాంబుజంబుగని దేహనయన్న స్మరంతిలేక నా
మానసమంతయున్ గలగె మన్మథుడాస్త్రన మధ్యచోరుడై

దానిటుజేయబూనెనొకొ తప్పక జిక్కితి నేమిసేయుదుర్
నేనెటు దాటిపోదునన యీస్త్రన పర్వతమడ్డు వచ్చెగా.
అయినను నిదియు నొక యదృష్టమే ఏమన?

సీ. కల్కి చెక్కిలినొక్కి కౌగలింపవచ్చు
ముఖము ముద్దిడవచ్చు ముచ్చటగను
భామ జన్నులుబట్టి బంతులాడగవచ్చు
నధరసుధారసం బానవచ్చు
చానసూగారును సవరింనగావచ్చు
మరుకేళిలో మయి మరవవచ్చు
యూరుకాండము మధ్య నుయ్యలూగగవచ్చు
సరససంభాషణ సలుపవచ్చు

గీ. నెలతతో గూడి క్రీడించి నేలవచ్చు
యతను సామ్రాజ్యమంతయు నంతకన్న
సౌఖ్యమొండేదియును లేదు చక్రవర్తికైన
వనములవసింయించు ఘనులకైన. మరియు

సీ. మోము మోమునజేర్చి ముద్దిడ గల్గెనా
చంద్రమండలమేల జాలినట్లు
ప్రేమనాహస్తంబు పెన్నెరులంటెనా
యురగభూషణుసేవ యొప్పినట్లు
గమలాక్షి గన్దోయి భ్రమదీరజూతునా
కమలజుజూడంగ గలిగినట్లు
యధరసుధారసం బానంగగల్గెనా
యర్కజుతో సఖ్యమందినట్లు

గీ. ఔర! నాకింతకంటె భాగ్యంబుగలదె
యన్నున్నులకుమిన్న జన్నులు యుదిమిబట్టి

మన్మథక్రీడ చేలిన మదనుగూర్చి
తపముజేయఁగనేల యీతరుణికొఱకు

గీ. ఎందుయీయింతి బోలిన మందయాన
గందునో లేదొ గాని యీకుందరదన
పొందు చేకూరుటెంతటి పూర్వపుణ్య
మొక్కొ దర్శనమయ్యె హా ముందునాకు.

సీ. ఏకాదశీవ్రతం బేనుజేయుచు నిత్య
ముందునో యీభామ పొందుగోరి
యమవాసనాడు నేనాహారములు మాని
యుపవాసముందునో యువిదగోరి
పున్నమనాడు నేపురహరు నతిభక్తి
గనిగొల్తునో మదికాంత గోరి
కనకంబుతో జేయు కలశముల్ దానంబు
జేతునో చెలిజనుల్ జేరిపట్ట

గీ. భూప్రదక్షిణ మొనరించి పుణ్యనదుల
గ్రుంకులిడి తీర్థయాత్రలు గోర్కెదీర
జేసినట్లయిన జెలిపొందు చిక్కగాని
వట్టియాసతొ జూచిన పట్టువడునె?

చ. చెలికుచదుర్గగసీమగని సేతుమహత్యము జూడగోరి కా
నలవిహరింపుచున్ జనెడు నాభిప్రదేశపు పుష్కరంబనే
జలధికి యారుదానిగని సఖ్యముజేయ సమస్తపుణ్యముల్
గలుగుననుగాన జేరువకు గ్రిక్కన బోయెద నాశ్రయించగన్.

శా. నేకాశీగయపుణ్య తీర్థములకై నేలాగుపోనేర్తునో
యీకాంతకు చదుర్గసీమ గనినన్ మెంతో భయంబయ్యెడున్

బోర్కన్ దీరదు దీనిపొందుబడయన్ బోవంగ నూగారుపా
మేకాకై కుచమధ్యనుండి కరచున్ ఏమబ్బునో యీశర్వరా!

(అని సర్వాంగసౌష్ఠవమును నేత్రోత్సవముగ జూచి మోహంబుపట్ట జాలక) హా! సఖ! మన్మధమూర్ఛాపరవశుడనగు నన్నాదరింప నీదే భారము (అని నేలకువ్రాలును.)

యామి—(అదరిపడిలేచి) హా! యేమి! నాకై జదువుజెప్పనియమింప బడినందులకుగదా యీకవిశిఖామణికిట్టిగతిసంప్రాప్తమైనది. హా!

క. విద్యలకెల్లను నుత్తమవిద్య
గవిత్వంబునేర్చి విరహముచే దా
మద్యముద్రావిన నరువలె
విద్యలభోజుండువడియె విహ్వలుడగుచున్.

అయ్యో! నేడేమిసేయుదును నేనెంత నిర్దయురాలనో గదా.

గీ. జదివితిని వీనిచెంతను జవ్వనమున
గురుడు దానయ్యెనిప్పుడు మరునిబాధ
పరితపించెడు వీనికి బాధమాన్ప
గురుడనేనైతి యింతలో వరములొసగ.

హా! నేనేమిసేయుదాన నిప్పట్టున మత్తనుస్పర్శ సందేశంబునగానియిక్క విమన్మధుండు లేవని మాటనిక్కంబు మత్తనువు బులకాంకురిత మై యిక్కవిశిఖామణి గాఢాలింగనం బబ్బినజాలునని తత్తరప డుచుండె డెందమెన్ననో గురుడని నొక్కింత సందేహించుచుం డె పల్కరించెదమన్నను మన్మధజ్వరముచే గళమునకు వణకు బుట్టి గద్గదస్వరమయ్యె. యేదియెట్లయిననునొక్కప్రమాణము మాత్రమిప్పుడు స్పృహకు వచ్చుచున్నది ఏమన?

క. సుందరపురుషుల జూచిన
డెందము తత్తరముజెందు ధీకోనుదారక

సుదెట్లుజిక్కునోయని
ముందుగ పైడరుగాని ముదితలకెపుడున్.

అల్లి గానిచో?

సీ. తాగన్నతండ్రి నేదగుదంచు వరించె
భారతీదేవియే పాడిదలచె
దేవతాప్రభువంచు ధీరతర్వమున గూడె
నాయహల్యకునేమి న్యాయమొక్కొ
సాహసంబున గూడె చంద్రునివిటుజేసి
తార తానేబుద్ధి తలచెనొక్కొ
రాధమాధవుతోడ రమియింపదేమున్న
యేమి ప్రమాణంబు నేర్చెనొక్కొ

గీ. పతులయెడ జాలపతిభక్తి పరిఢవిల్లి
సమయమును వేచితామప్పు జాణలగుచు
కోర్కెలూరంగగూడరె గుట్టువదలి
వారిముందర నేనెంత నారిమణినో.

సీతులకేమి? నెరవేర్చుటకష్టము,

సీ. యీకవిమన్మథుం డిపుడు చంద్రుండయ్యె
నేతారనై తిని నిక్కముగను
యీకవిజూడగా నాకవిభుండయ్యె
నేనాయహల్యను నేడు నిజము
యీకవిమాధవుండీ వేళదానయ్యె,
రాధను నేనైతి రతులదేల
యీకవి వెనుక నాకిష్టగురుండైన
వరుడయ్యె నిప్పటివరుసజూడ

గీ. యన్నివిద్యలు గఱపిన యతడెగురుడు
అతనువిద్యను గఱతునేనితనిగూడి.
చిత్రబంధ కవిత్వంబు జెప్పెనింక
చిత్రబంధంబులను నేర్తు చెలఁగుచిపుడు

సీ. ఇతనివక్షంబుతో జతసేయ లేకున్న
వక్షస్థలంబేల వట్టి బొంద
యితనితో జతజేసి రతిసేయకున్న
జన్మమెగత్తనేల జంతురీతి
నితని బాహులమధ్య సతతంబు లేకున్న
సతిశరీరంబేల మృతశరీర
మితనితో గుల్కుచు హితమతిబల్కుచు
సంచరింపగలేని సాధ్వియేల

గీ. యితనుగురుడైన నేమి నాపతియితండె
యితడె తల్లియు దండ్రియు హితుడు ప్రియుడు
యితడె యింతులపాలిటి యతనుడకట
యితనిబొందక విడుతునె రతులబెనగి.

హా! యేమి! యీకర్పూరమారశిలీ ముఖజ్వాలచే నొడిలంతయు తూండ్లు పడుచుండ యీశీతకిరణుడొంత వేడివెన్నెల గాయజేయుచుండెను యీతనికైనను నాయెడ జాలికలుగరాదా! ఏలకలుగును. మున్నీకవివర్ణించి యుండెగద యిట్లు.

చ. విరహిణులెల్ల సౌధమున వీచెడిచల్లగాడ్పుగోరి తా
మరునకు మేనమామయను మాటదలంచక శయ్యజేరినన్
సురసుర క్రాగజేసెదవు సొంపగు నీకిరణ ప్రభాళిచే
హర హర యింతపాతకపు హానిదలంచితె చంద్రయింతులన్.

మరియు.

గీ. సంద్రమందున బుట్టితి చంద్రనీవు
కమలయునుబుట్ట నచ్చట కమలశత్రు
వైతి వేమిర నీపుట్టు వంతరించ
సారసాక్షులమగు మమ్ము జంపుటకును.

సీ. ఓరిదయాహీన మారెమ్మవలె మాకు
దాపరించితి వేల మాపులందు
సౌధంబు వెలువడి చల్లగాలికిరాగ
న్యాయమానీకిట్లు నలత వెట్ట
పరువెత్తి శయ్యపై బవళింతుమందునా
మారునంపెద వింత ఘోరమేమి
అల్లుడు యతనుపై యడలగొట్టుచునుండ
పైన గాపుంటివా పాపినీవు.

గీ. ఆడుపుట్టువుతో నీవు నాడుపుట్టి
గోడుబెట్టెదవా మమ్ము గోరుచుట్టు
పైనరోకటి పోటిడ పాపమనుచు
జంకవేమిర చంద్రమా! శరణు శరణు.

చంద్రు నెట్లయిన బ్రతిమాలి వేడి వెన్నెల తగ్గించవచ్చు సేమోగాని
ఎచ్చటను గానరాని మన్మథునిగూర్చి నేమని బ్రతిమాలుదాన.

గీ. తాళజాలర నీబాధ తనువులేని
కామదేవుడ నీవిదే కరుణజూడు
వందనంబాచరించెద వరునిసఖ్య
మందువరకును నాగ్రహ మందబోకు.

అబ్బా! యిట్లు బ్రతిమాలినను మానుదువా! ఛీ! కలుషాత్మా! యిదె
చూడు.

ఉ, నాచనుకొండలందు శివనాథుడు ఘోరతపంబొనర్చెనో
నీచుడగంటివో గనవొ? నిన్నిపుడెంతయు బూదిసేయు నా

రాచములేయబోకు సుమి రాచకుమార్తె నటంచు వెఱ్ఱివై
గాచుకొనీదు ప్రాణములు గాల్చుచు త్రినేత్రి మహాగ్నికీలలన్
యిటులభయము పెట్టినను వెఱచినవాడు కాడయ్యో అయ్యో యింతకన్న
నన్ను జేయునదేమి నీసంగతెలుగక పోయిన మరీ బెదరించెదవు.
యింక తెగించితి రమ్ము.

సీ. మారుడా నీదగు మర్మమంతయు నేను
 నెరుగుదు పొమ్మిక వెఱపులేదు
యిక్షుధనస్సట యిదియేమి సేయును
 విరచిన ముక్కలై విరిగిపోవు
నారితుమ్మెదలంట నన్నేమిజేసును
 చంపకనాసకు జంకిపోవు
శుకపికశారికా నికరమునీదండు
 బెదరించినంతనే బెదరిపోవు
తఱుతానేవచ్చి దండింతువన్నను
 దనువేదిరా నీకు దమ్ములైన
గీ. నీదు సొమ్మెందు మాయవి నెలతసొమ్ము
తిన్నయింటను వాసాల నెన్నినట్లు
మమ్ము మాబాణములచేత సొమ్మసిలగ
జేయుచుంటివి నీకేమిచేటొగాని

హా! కవిచంద్రిమా! నీకైనను నాయెడజాలిలేదా గురుడవై యుంటివి గదా.

ఉ. మారుడు క్రూరుడై యిపుడు మారణబాధను బొందజేసె నా
ధారములేరు యెవ్వరును దారుణబాణ పరంపరాళిచే
సారెకు సారెకున్ బరపి జన్నులపై గురిబెట్టె గొట్టె న
య్యో! రతిజేసిగావు మిక యొజ్జనటంచును సంశయించకన్.

చ. మదనసమానులంచు మిము మాజనకుండొకమాయపన్నినా
డదిబయలయ్యెనేడు యిక యడ్డముజెప్పను సుందరాంగనే
జదువుచునుంటి మీకడను సత్కవితంబది యంకురించె యే
కొదువయులేదు మిమ్ములను గూడిసుఖించుట దక్కనియ్యెడన్.

క. శరణంబని చరణములకు నొరిగిన
యార్తులను ద్రోయ నొప్పునె న్యాయం
బరయుడి పరోపకారం బిరువుగ
జేయంగనొప్పు నీక్షణమందున్

(అని పాదములపైన బడును)

బిల్హ—(మూర్ఛదేరి) ఆహా! యేమిది యివ్వగలాడి నాచెంతకే వచ్చి మన్మథావస్థ మున్గియుండె నామనంబునం దెట్లయిన నీచెలిపొందుబడయుటకు గదా పరిపరివిధముల దేవతలకు మ్రొక్కుచుంటిని. దేవతారాధన జేయువారూరక పోదురా సద్యఃఫలంబిట్లు చేకూరవలెను.

మ. తరుణీ చూపులు తూపులయి యిపుడు నోతన్వీతనూచ్ఛిద్రముల్
బరపెన్ జూడుము, బాధమాన్పగు, నీపాలిండ్లుమై దానికిన్
ధరపైనిచ్చెద గొంతకాలమటుపై వారివంగ నియ్యంగదే
వరవర్ణియధరామృతంబు ఘననీవైద్యంబు నేగోరితిన్

మరియు.

సీ. కాయజుశరహతి గడు సుక్కియుంటిని
కరుణజూడుము నన్ను కమలనయన
చంద్రువెన్నలకాక శ్రీమపడి యుంటిని
మందహాసము జూపు మరపుగల్గ
చిలుకపల్కుల జెవులు చిల్లులువోయె
గుల్కుచు మాట్లాడు గుబ్బలాడి

అధరపానమొసంగి యన్నుల మిన్ననా
బన్నంబులను బాపు బ్రతుకజేసి

గీ. కన్నుదమ్ములు విచ్చి నీకరయుగంబు
జాచికౌగిలొసంగుచు జన్నులొత్తి
మన్మథుని రాజ్యరమకీవె మంత్రివగు
నతను సామ్రాజ్యమేలించుయతివనన్ను

యామి—లేచి హా! నవమన్మథాకారా రూపజిత జయంతా అబలా మానధనాపహరణా! దయాసింధూ నావ్రతఫల ప్రదాయకా నీకై నేపరితపించుచుండ నీవు నన్నింత బ్రతిమాలవలెనె నీకన్న నెక్కుడుగ మరుబారికి లోనయి బాధపడుచున్న నన్నుద్ధరింపుము. యిదె నీపాలబడితిని. మీదనీచిత్తము (సమీపించి కరముసట్టి)

చ. తలనరుకంగ వచ్చినను తథ్యము నిన్నెవరించి యుంటి నే
నలుదమయంతి చందమున నమ్మితి మిమ్ము మహాత్మనింక శా
నలఘున దుర్గసీమలకు నై ననువచ్చెద నిశ్చయంబు మీ
రలుదయనేలకుండినది రంబుగ బ్రాణములన్ త్యజించెదన్

మహాత్మా! మనోవాక్కాయ కర్మంబుల త్రికరణశుద్ధిగా మిమ్ము నా పతిగా బరిగ్రహించితి. యిందులకీ పంచభూతంబులును సూర్యచంద్ర నక్షత్రరాత్రిం దినములేసాక్షీ.

బిల్హ—(యామినీపూర్ణతిలకను గౌగలించుకొనిపరవశుడై)

మ, చెలినీ స్పర్శసుఖంబుచే నిపుడునే శీఘ్రుం బెధన్యుండనై
ఫలమందన్ గలనంచు నుబ్బితినినీ పాలిండ్లుతో గుబ్బిమ్మగన్
గలిగెన్ భారమునే రమన్నని పుడే గానంగ ఠావంచునే
నలుకల్జెందమ | నేమచేతగదహా యానందమా | గుమ్మినన్ ||

గీ. చిత్రమయ్యెను మీతండ్రి చేతలకట
చిత్తజుని శాసనంబున జెల్లునొక్కొ
చిత్తమున భీతిలేకుండ చెలగిరతుల
దేలి యానందసౌఖ్యాబ్ధి దేలు మబల

మరియు

గీ. ఎంతధన్యుండనో గద యింతినిన్ను
జూడగాగల్గె తోడనె సురతకేళి
గూడగల్గుట సిద్ధించె గురడగాన
రుణము దీర్చెదవో మరురణము జేసి.

శా. భామా నీదగు పొక్కిలిన్ వెడలుటల్ పామయ్యెనూగారుదో
నేమోమోమను చంద్రుమిఁగుటకునై యేతెంచుచున్ మెల్లగా
నీమైమధ్యమునుండు పర్వతములల్ వెక్కంగలేదయ్యె హా
భామాజూచితె పాము నెట్లు భ్రమింపల్ జేసెనో చనుల్.

సీ. వాలుగన్నులజూడ మీలనేలగ జాలు
కమఠంబులయ్యె మి గాళ్ళుజూడ
వనిత నీతనుకాంతి వర్షాగమంబున
గొంకొక్కారు మెఱుగయ్యె నిక్కమిదియు
గబ్బి గుబ్బలుజూడ నుబ్బిగంతులువైచు
కోకదంపతులయ్యె కొమ్మ నిజము
యతివనీయూరులు నతనూత్సవంబున
నరటికంబములయ్యె నదినిజంబు

గీ. భామనీగాను బిడికిట బట్టవచ్చు
నధరబింబంబువర్ణింప నలవి యగునె
కవులమని విఱ్ఱవీగెడి ఘనులకైన,
శిరములను వేయిదాల్చిన చిలువకైన

ఉ. కుందన బొమ్మనీకలుకు గుబ్బలుబట్టి రమించు భాగ్యమున్
చందురుబోలు నీముఖము చక్కగ ముద్దిడునట్టి పుణ్యమున్
సుందరమైన నీసొబగు జూచుచుండెడి సొంపు బెంపు నే
నెందును జూడబోను చెలి యెంతటి పుణ్యదినంబొ నేడొకో.

యామి—ప్రాణవల్లభా అట్లనెదవేమి?

సీ. చదివితి మీచెంత సకలలక్షణ శాస్త్ర
చయములు భయముతో నయముమీర
నేర్చితి మీచెంతనే చతుర్విధ కవి
త్వంబులు జెప్పంగ దనరిమరియు
నవరసాలంకార నాటకంబులు జేయ
నేర్చితి మీచెంత నేర్పుమీర
చిత్రబంధాశ్లేష చిత్రంబులను నేర్చి
చిత్రబంధాశ్లేష చిత్రరతుల

గీ. నేర్వనైతిని మీరింక నేర్పి ప్రౌఢు
రాలగాజేయ బ్రార్థింతు రసికవర్య
యన్నివిద్యలు నేర్పంగ నన్ను దండ్రి
యొప్పగించెను గావున దప్పుగాదు.

గీ. బంధకవిత్వంబు నేర్చిన ప్రౌఢగాన
బంధముల దేల్చి కావుమో ప్రాణబంధు
గర్భకవిత్వంబు నేర్చిన కన్యగాన
కవితనుజేయుమా నిర్భయముగ.

వెయ్యేల నామనోనిశ్చయంబిదె వినుము.

సీ. మదనావతారనిన్ ముదమారగాంచంగ
గన్దోయి నిత్యంబు గలవరించు

మదినుత్సహించి నీ యెదజేరివసియింప
గోరుచు గుబ్బలు గ్రుమ్ములాడు
మక్కువతోడ నీచెక్కిలి ముద్దాడ
నధరంబు నీచెంత కరుగజూచు
కలుకచునీతోడ చెలరేగి మాట్లాడ
జిహ్వాగ్రమెంతయు జిందులాడు
గీ. నీకు సేవనుజేయంగ నెదదలంచు
హస్తపద్మములెంతయు నాత్మనిన్ను
రతులబెనగొనినోడింప మతిదలంచు
కలివికులోత్తమ నిన్ను నేగాంచినంత

ఉ. భారతి రూపలక్ష్మినెడబాయక విష్ణువొసంగె వక్షమున్
భారమటంచు నెంచెనొకొ పార్వతికిచ్చె శరీరమే సగం
బారజతాచలేంద్రుడహ హా! సతిభర్తలన్యాయ మెట్టిదో
మీరలెఱుంగ రొక్కొ నికమీదగు చిత్తము నాదుభాగ్యమున్.

మరియు

ఉ. గూడడె నాడు బ్రహ్మ దనఁ గూఁతు నలక్షణురాలటంచుఁ దా
క్రోడయి కూసి గౌతముల కోమలిఁ గూడడె; యింద్రు డయ్యయో
ఫోడిమిమీఱ చంద్రుడల పోకిరియై గురుభార్యఁ గూడె, నె
వ్వాడిక బుద్ధిమంతుఁ డయ వార లెఱుంగని ధర్మమున్నదే!
(నొకరి నొకరు కౌఁగిలించుకొనుచుందురు)
(ప్రవేశము విదూషకుఁడు.)

విదూ—వహ్వా! అక్షరాభ్యాససానంతరమందు రాజుగా రెట్లు యాశీర్వ దించిరో! యట్లె అయినది. నేను చెప్పలేదా! అతనువిద్యాభి షిక్తులం డధికురాలనుఁ జేయు ననియు, చిత్రబంధాశ్లేషలు గలు పుననియు, ఆమాటకుఁ గల అర్థమైనను, రాజునకుఁ గోచరము

కాలేదు. మహాబాగుగా జరిగినది. నాకు చాల సంతోషముగా యున్నది. దైవమిప్పుడు, అన్యాయ మాలోచించునా, యిర్వు రు అసమానరూపురేఖావిలాసముగలవారును, కవితాకన్య రసికత నెఱిగినవారును గావున వీర లిద్దరికిఁ గలసిన మహాసంతోషమున, మన్మథసామ్రాజ్యమంతయు పట్టము గట్టుకొని నేలుదురని యెంచి; దైవమును వీరి కనుకూలవడియె, తెలియక మనమెన్ని వెఱ్ఱిభ్రమలుపడి అడ్డుతెరలు గట్టినను కానున్నది కాక మానునే! యింతకూ మనమంత్రిగారి ఆలోచనే గొంతుక కోసినది. శెహబాష్, చాలు యింతకన్న రాజునకు వేఱె తలవంపులు కొనితేవలెనా; నే నిదే పోయి వూరంతా చాటివచ్చెదను. తిన్నయింటను వాసాలె నెన్నవలెనన్న సామెత వూరికె పోనియ్యరాదు. బిల్హణుఁడు-పోని రాజాశ్రమంలోవుండి బ్రతుకుచున్నామని వూరకున్నాఁడు గనుకనా! నే నిప్పుడు వూరుకోవడానికి చూడండి నామహిమ—

(నిష్క్రమించును)

తెరపడును

ఇది ద్వితీయాంకము.

—





శ్రీరస్తు.

యామినీపూర్ణతిలక

అను

# బిల్హణీయము



## తృతీయాంకము.

---

### ప్రథమరంగము.

---

(అంతఃపురదాసీలు_ కమలాక్షి కీరవాణి, చిత్రరేఖ ప్రవేశము)

కమ — కీరవాణీ! నీవంతిపురిని విశేషము లేమయిన క్రొత్తవి గనిపెట్టితివే?

కీర — కమలాక్షీ! నాకేమీ క్రొత్త విశేషములు కనబడవు. గాని నీవేమైన నెఱుఁగుదువా యేమి? మేముఁగూడ విని సంతసించెదము

కమ — ఓసీ! మీరు విని సంతసింపదగిన యంశము కాదే, రాజువినిన మనలను సాగనంపే సంగతిగా నున్నది—

చిత్ర — ఆఁ! యేమిటి మనప్రాణంమీాదకి వచ్చినయంశమేనా, అబ్బా! అట్లయిన మనము మరి యుండరాదు. అది యేదో త్వరగాఁ జెప్పుము. నాన్చక.

కీర—నీకు పదివేలదండములు. ఆసంగతి యేదో త్వరగాఁ జెప్పవేతల్లీ ఆసక మనపుట్టు ములుగుతుంది.

కమ—నన్ను చెప్పమనక మోదుకూ, మీా రెరుంగరా! యామినీపూర్ణతిలకను ప్రతిరోజూ చూచుటలేదా, కొత్త సంగతులు గోచరము కావడములేదా, యెరిగియుండియు నాచేత జెప్పించనలెననియా?

కీర—ఏమిటె మన మంతఃపురపరిచారికలమై, సదా రాకొమార్తె నుంచిచెడ్డలను రాజున కెఱిగించుభారము మనమీాద యుండగా యామినీపూర్ణతిలకయెడ యేమి క్రొత్త సంగతులు కనఁబడుచున్నవి. మాకంటె నెంత బుద్ధివిశేషము గలదో యీ కమలాక్షి కాకున్న మనమెఱుంగని నూత్నాంశము దీని కెట్లు దెలియును. అయినను యిట్లు జరుగలేదుగదా;

గీ. గురువుగా రెంతయును పుట్టు గుడ్డి టంచు
గూఁతునకుఁ జెప్పి జదివించె గుట్టు నేఁడు
బైలుపడలేదుగా, యదె బైలుపడిన
గురుఁడు వరుఁడౌను మన్మథు డౌరనుదీయు

అంతపని జరిగిన మన అందరిపని అయినట్లే. ఏమో నిర్వురు సుందరులే గదా?

కమ—ఆఁ! కీరవాణి దారిలో పడినది. అదె, అంతకన్నేమి యున్నది వింత.

చిత్రి—అమ్మయ్యో! (అని గుండెలు కొట్టుకొని) ఆమాట నిజమేనా యేమిటే, నాగుండెలు తటతట కొట్టుకొనుచున్నవి. యిపుడు రాజున కీసంగతి తెలిసిన ముందు మనతల దీయిస్తాడు.

కమ—ఓసీ! యింకా నిజమేనా అంటావేమిటె? ప్రతిరోజు చూచుచుండలేదా, చెలి చేయు మన్మథచేష్టలు, చెక్కిళ్ళ నొ

క్కలు, ఆముఖవిలాసము మునుపటివలెనే యున్నదా! నూత్న తనుచిహ్నములు కళ్ళను గట్టిన ట్లగపడుచుండ నేర జెప్ప వలెనే?

కీర—అవును కమలాక్షి, రాజుగారు కవిగుప్తిడ్డివాం డనినంతలో అట్లగునా, రవి గాననిచో కవి గాంచునేగదా, అను నార్యోక్తిం అబద్ధమా ?

మ. కవి, తా గన్నులఁ గాంచునే ఘనములా కాంతార దుర్గంబులన్
దివిపై సుండెడి దేవతాప్రభువులన్ దివ్యాంగనారూపముల్
నవశృంగారవనంబులన్ మెలఁగుటల్ నారీమణుల్ జాడలున్
భువినొప్పెడి పుణ్యతీర్థచయముల్ బుద్ధిన్ గాంచి వర్ణింపఁడే.

మరియు నీకవి కవిసార్వభౌముఁడట, నొక్క తెరచాటుననున్న యామినీపూర్ణతిలకను గుర్తించలేడా, కానున్నది కాకమానదు, చిత్రరేఖా యిప్పుడే పోయి రాజుగారి కీవార్త నెరిగింపుము. ఆసక యెటునుండి యెటువచ్చునో మనకేల యీా నిష్ఠురము.

చిత్రి—అవును, యామినీపూర్ణతిలక కేవిపత్తు సంభవించినను ముందుగా నాముఖతఃగాని, రాజుగారి కెరిగించువా రెవరు నాకు తప్పునా యిదె పోయి రాజునకు విన్నవించెదను. (అని ముందుకు నడచి, తనలో) హా! దైవమా నీమాయ గడవ నెవరి తరము—

గీ. సకలవిద్యలు నేర్పించి చక్కనైన
నొక్క రాకుమారునకిచ్చి నోహో యనంగ
పరిణం బాచరింపగ ప్రభువు దలఁచె.
నదియు ప్రతికూలమై యిటు లయ్యె నహహా!

రా జింధుల కేమి శిక్ష విధించునోగదా! (నిష్క్రమింతురు)

## ద్వితీయరంగము.

---

స్థలము:—మదనాభిరామనృపతి కొలువుకూటము.

(మదనాభిరామనృపతి సింహాసనాసీనుండై యుండ వసంతుడు, మరి కొందరు సభ్యులు పరివేశము.)

రాజు—మంత్రిసత్తమా! మన యామినీపూర్ణతిలకకుఁ దగినవరునిఁ జూచివచ్చుటకై పంపించిన భూసురోత్తములు యెచటికేతెంచి యుందురోగదా, యెట్టివరుఁడు లభించునోగద!

గీ. సిరియుఁగల్గిన గులము మంచిదియు రాదు
కులము మంచిదిగల్గిన గుణము సున్న
గుణములుండిన రూపంబు గూడు టరుదు
అదియు సమకూడియుండిన చదువు నాస్తి.

గావున యొకటుండిన ఒకటి లోటుండును యివన్నియుఁ గొఱంతలేక యెచ్చట తగినసంబంధము కుదురునో యని నామానంబు తల్లడిల్లుచున్నయది.

వసం—దేవరవారింత తొందరపడి తొక్కిసలాడగూడదు. మనము పంపించిన భూసురోత్తములును తగినంత పరీక్షఁజేసినగాని తగిన వరుని నిశ్చయింపుదురని దలచరాదు వారును కొద్దిరోజులలోనే వత్తురు యేది యెట్లున్నను దైవయత్న మెట్లున్నదోగదా. మనమింతవరకు తగినవరుఁడు దొరకనందుకేగదా యూరకుంటిమి. కల్యాణము వచ్చిన ఘడియ ఆగదు.

మ. జననంబందక పూర్వమే యజుఁడు దా చాతుర్య మొప్పరఁగా
మనుజుం డా ప్రతివానికి న్నొసలపై భార్యాభర్తలా వీరలం
చును దా వ్రాసియు సౌఖ్యదుఃఖచయము లోఁచద్యంబుగా వ్రా
యుడే; యనుమానించెదరేల బ్రహ్మలిఖితంబం దెవ్వరిన్ గూర్చెనో.

చిత్రి—(ప్రవేశించి) జయం జయం మహారాజా, (నమస్కరించి నిల్వఁ బడి యుండును.)

మద—చిత్రరేఖా! యేల నీవింత తొందరగా పనిగల్గి వచ్చితివి అంతః పురవాసులందరకు గుశలమే గద. మన యామినీపూర్ణతిలక సుఖయే.

చిత్ర—చిత్తము మహాప్రభూ అంతిపురవాసు లెల్లరు సుఖంబున నున్న వారు. అందు మీయామినీపూర్ణతిలక గురునితోఁగూడి అన్న పొరబడితిని. గూడసుఖినియై యున్నది.

మద—చిత్రరేఖా! యేమి పొరబడుచుంటివి. మాటలు తొట్రుపడు చున్నవి. మున్నెప్పుడిట్టి పొరబడని నీవేయిట్లు తడబడుటకు కా రణమేదైనా యుండెనా యేమి?

చిత్ర—ప్రభువులదర్శనమే బానిసలకుతొట్రుబాటుపుట్టించును. ఇంతమా త్రమునకై మీరు పరిపరివిధముల యాలోచించుచుంటిరి. యిట్టి దీర్ఘాలోచనసేయువారే తుదకు మోసపోవుదురు.

వసం—ఆ అదియేమి పెద్దకబురులు జెప్పుచుంటివి. దీర్ఘాలోచనసేయు టవలన మోసమువచ్చునా! యెంతవింత అట్లేదీని దృష్టాంతర ము చూపెదవా!

చిత్రి—ఆహా! చూపకేమి, యిచ్చుటనేజూపెదను. మన ప్రభువువారు బిల్హణునిచెంత విద్యాభ్యాసమొనర్చిన ముప్పువచ్చునని యెంచి నిరాకరించి యూరకున్నంతలో తమరేకాదా దీర్ఘాలోచినజేసి వ్రతమను నెపముబెట్టి నడుమతెరగట్టించి చదువుచెప్ప యేర్పా టుచేసినది.

వసం—అవును అందుకేమైన లోపముగల్గెనా యేమి ఎట్లయినను కవి త్వవిద్య జెప్పించుటకు గద అట్లు మంత్రాలోచనజేసితిని. యిపు డు మన యామినీపూర్ణతిలక రచించు పద్యములు జూచుచుం

డుటలేదా! మెట్టికవిత్వ మలవడినదో విని్మైన నెఱుగవా యిం దు దీర్ఘాలోచన మోసనేమి సంభవించినది.

చిత్ర—(తనలో) వీరలింక ఆ వెర్రినే యున్నారు. (ప్రకాశముగా) మీ రలేర్పరచిన తెర నిర్వురు సుందరులనియేగద అట్టియెడ ఆ తెర భిన్నమైనచో మీదీర్ఘాలోచన యేమగును?

వసం—అట్లేజరుగును. వారిర్వురువ్రతము చెడగొట్టుకొందురా! అట్లె న్నడూ జరుగదని యనుకొనుము.

చిత్ర—అట్లే జరుగునని నిర్ధారణచేసినచో అటుపైన నేమిజరుగునో చె ల్పుడు. కోపపడకండి.

రాజు—చిత్రరేఖా! ఏమియిట్లు వాదించుచుంటివి. నీరాకజూడగా నేదియో అనుమానాస్పదముగా నున్నది.

చిత్రి—దేవా అనుమానమునకేమున్నది మంత్రిగారిమాటలకు నుత్తరువు చెప్పుటయందే యింత అనుమానముండిన —అనుమానముండిన కార్యము లీలజేయుదురు.

రాజు—అదుగో అనవసరపుగొడవకే దిగుచుంటివి. నీకేమయ్యు పని లేదాయేమి, యామినీపూర్ణతిలక నిన్ను తగినపనికి నియోగించుటలేదుకాబోలును. కొల్వుకూటమునకువచ్చి తీరికగా వాదించుచుంటివి.

చిత్రి—మన యామినీపూర్ణతిలక యిపుడు నాపాలిటానికి కామినీ పూర్ణతిలకమైనది. అందుమూలముననే నాకీకొల్వుకూటమునకు రాబనిగల్గినది. లేకున్న నంతిపురినేయుందును.

రాజు—చిత్రిరేఖా యేమి అట్లనుచుంటివి. యామినీపూర్ణతిలక నీకు బాధకరములగుపనుల నాజ్ఞాపించుచున్నదా, అందుకు అంతఃపురమువదలి యిటువచ్చితివా?

చిత్రి—ఆమె నాకేమియు బాధగలుపనులు నియోగించుటలేదు.

రాజు—అట్లైన యారక యిటులవచ్చితివి అంతఃపురమెవరికి వప్పగించి వచ్చితివి త్వరగా జెప్పుము.

చిత్రి—అట్లడిగిన జెప్పకుందునా, అంతఃపురము కవిగారికప్పంగించి తద్వార్త మీకు విన్నవించుటకు నేనిటువచ్చితి.

రాజు—అంటే కవిగారికిప్పుడు వప్పగించినాననుచుంటివి యిదివరకు కవిగారు అంతఃపురసౌధముమీదనేగదా యామినీపూర్ణతిలకకు విద్య గఱపుచుండుట ఆయనకు అంతఃపురము నేడు క్రొత్తగా వప్పగించితిననుట కేమి హేతువు?

చిత్రి—ప్రభూ నేను వప్పగించియుండలేదు. తమరే బూర్వము అంతఃపుర సౌధమొసంగి అందు విద్యగఱపుమని ఏర్పాటు చేసిరి. అందు నా పెత్తనమేమున్నది. అంతకూ కవిగారిపెత్తనమే గాన అట్లంటి.

రాజు—అదేమి. అంతకూ కవిగారిపెత్తనమేయనుచుంటివి. అట్టిస్వా తంత్ర్య మిచ్చియుండలేదు. యామినీపూర్ణతిలకకు విద్యజెప్పు టకుమాత్రి మేర్పరచితిని.

చిత్రి—ఆమాట నిశ్చయము మే. ఆడవాండ్రునివసించు అంతఃపురిలో నేకమొగవాడు ప్రవేశించిన అందు యెవరిపెత్తన మెక్కుడుగా నుండునో తమకుదెలియకుండునె కవిగారికి మీరు స్వాతంత్ర్య మియ్యకున్ననుకొదువ వారియ్యగూడదా.

రాజు—కొదువ వారనగా అట్టివారెవ్వరో స్పష్టీకరించి చెప్పరాదా ఆలస్యమగుచున్నది.

చిత్ర—తెరచాటునున్న వారు.

రాజు—యామినీపూర్ణతిలకా అందులకేగద ఇర్వురకునడుమ తెఱయుం చుట అందుచేత నిర్వురకు సంబంధమేలేరు.

చిత్ర—తెరలేకున్నచో స్వాతంత్ర్యమియ్యగలదా?

రాజు—అల్లరిజరుగును. వ్రతము చెడగొట్టుకొందురా,

చిత్ర—వ్రతమేలచెడును.

రాజు—యామినీపూర్ణతిలక పుట్టుగ్రుడ్డిని జూడదను వ్రతము నీవె
ఱుగవా.

చిత్ర—యెఱుగుదును ఆమె పుట్టుగ్రుడ్డిని జూచునప్పుడుగదా వ్రతము
చెడుట అందు పుట్టుగ్రుడ్డి యెవరువున్నారు. యుండిన నేల
జూచును.

రాజు—మరి యెవరినిజూచెను.

చిత్ర—నవమన్మథాకారుడైన బిల్హణ కవిగారిని. అనగా గురువుగారిని.

రాజు—(ఆత్రముతో) యేమేమి తెర యెవరుభేధించిరి. ఆయనను
జూచుట కేమిహేతువుగలిగినది. యీమర్మమెవ్వరుజెప్పిరి.

చిత్ర—ప్రభూ తెరభేదించుటకు మావంటి దాసిసలకు మీయాజ్ఞ బు
ద్రనీయునని యెరుగమా, అందుకాపెయె స్వతంత్రురాలై భేదిం
చెననుకొందు.

రాజు—అంతమాత్రమునకై యేమిలోటుగల్గలేదుగద.

చిత్ర—అటుపైని నేమికావరయునో అది అంతయు జరిగెనుకొందు.

రాజు—ఏమి నిశ్చయమేనా నిర్వూరకు సంబంధముకలిగెగా అట్టిసిద్ధా
రణ నీవు చెప్పగలవా!

చిత్ర—నిశ్చయముగా నిర్వూహగలసిరని చెప్పగలను. అందుకు మన
యామినీపూర్ణతిలక గర్భోత్పత్తియే ప్రబల నిదర్శనము.

మద—(క్రోధముతో) యేమి, దుర్మార్గుడైన బిల్హణుఁ డెంతద్రో
హముఁ జేసెను. మంత్రివర్యా, తక్షణం చారులనుబంచి బిల్హ
ణుని సభాస్థానమునకు రప్పింపుము. అటుపైన అన్నియుఁ బయ
లుపడగలవు. నేనును అంతిపురికి వెళ్ళి పేరిమయని జూడక కత్తి

ఝుళిపించి యామినీపూర్ణతిలకవలన యానత్ వృత్తాంతమును కనుగొందును యిదియే నిశ్చయమైనచో,

చ కవియగు బిల్హణాహ్వయుని కంఠము దీయుట కాజ్ఞయిచ్చి యీ
భువి నిటువంటి ద్రోహములు పుట్టక యుండగ జేయువాడ నా
కెవరిక యడ్డుపెట్టుదురు యింతటి ద్రోహియటంచు చేరుంగకే
కవి యని గౌరవించి మన కన్యక కొంతయు హానిఁ దెచ్చితిన్.

యిది నిజమైన బ్రహ్మహత్య సంభవించినను బిల్హణుని బురి తీయించకుందునే, బ్రాహ్మణుడయ్యు నంతస్వామిద్రోహ మొనర్చెను.

(అందరు నిష్క్రమింతురు)

---

## తృతీయరంగము.

---

స్థలము—అంతఃపురము.

(యామినీపూర్ణతిలక పుస్తకముఁ జూచుచు శయ్యపై నుండును)

రాజు—(ప్రవేశించి తనలో) అన్నా, యింతపని జరుగునని నే నెన్నఁడు నూహింపనైతిని. తానొకటి దలప దైవమొకటి దలంచునను మాట నిశ్చయమేగదా. (యామిపూర్ణతిలకనుఁ గాంచి) హా! కుమారి.

చ. చినతనమందు బిడ్డలను జెంతకుఁ దీయనెఱుంగనట్టి నే
నిను నరచేతఁ బెట్టుకుని నిక్కపుప్రేమను బెంచి పిమ్మటన్.
జనములు మెచ్చగా జదువు సాంగముగా జదివించి నిప్పు డీ
చెనటగు బిల్హణాధమునిచే దలవంపులు దెచ్చుకొంటివా.

అమ్మా యామినీపూర్ణతిలకా!

మ. జననీజనకులమైన మమ్ము గనకన్ జంకింతయున్ లేక పా
వనమాత్కులమందు బుట్టి దలవంపు ల్దెచ్చినా వక్కటా ?
విసరే బంధుగులందరున్ యిపు డయో విద్వాంసురాలయ్యు నీ
వొనరింపన్ దగనట్టి కార్యమని ము న్నూహింపకన్ జేయుదే?

మరియు,

చ. చదివినవారికంటె మరి చాకలి మేలను వార్త నప్పుడే
పదిలముఁ జేసితమ్మ మన బంధుగు లందరిలోన గొప్పగా
జదివెను యామినీతిలక సాటియే లేరని యుబ్బుచుంటి
నేఁ డది మృషఁ జేసితమ్మ నీక యందరితో సమమైనగాక హా!

చ. కొడుకులు లేకపోయిననుఁ గూతురె పెద్దకుమారుఁడంచు నే
నెడద దలంచి విద్యలకు నెల్ల గురుండని బిల్హణాధమున్
గడకతో విద్యనేర్ప నిను గారవమొప్ప నొసంగి తక్కటా
కడ కిటు జేయునంచెఱుగ కార్యము మించిన దేమి సేయుదున్.

అదియునుం గాక,

చ. నిను నొక రాకుమారునకు నిచ్చి ప్రియంబున బెండ్లిసేయగా
మనమున నిశ్చయించితిని మంచివరు న్వెదుకంగ భూసురుల్
జనిరి పురంబులన్ దిరుగ జవ్వని గర్వముచేత నిప్పు డీ
చెనటగు బిల్హణున్ గలసి చేయగ వచ్చునె? గాని కార్యమున్.

అమ్మా యిందుల నిజమెంతయో దెల్పుము. అట్లు దెల్పిన క్షమించిన క్షమింతును లేదేని కుమార్తెవని నిన్నును గురుఁడని బిల్హణునిఁ జూడక మత్కరవాలంబున కెఱఁజేసి యీ దుర్యశము వాపుకొందు ఇఁక దాచదలంచినను దాగదు. యథార్థమేద్దియో శీఘ్రముగఁ జెప్పుము.

యామి—(తల వంచుకొని గద్గదస్వరముతో) తండ్రీ! నేడేల నాయెడ నిట్టి పరుషోక్తులు పలుకుట. మీయెడ నేనే మపరాధ మొనర్చి

తిని. మీ కొఱకర్పు కృత్రిమమె మీకీయాత్మ వ్యధజేసి మది కలంచుచున్నయది. మీయాజ్ఞప్రకారమెనింతదనుక ప్రవర్తిం చుదాననని మీ రెఱుంగరే? నాచిత్తశుద్ధి మీకు దెలియదే, నెవ్వరేమి వచించినను మీరట్లనుమానించుట నొప్పునె; మీరు ఏర్పరచిన దెర హరించుట కెవరు సమర్థులు?

అదియునుం గాక;

క. నాకుఁ గలవ్రతము నెఱిఁగియు
వ్యాకులతం జెందనేల వసుమతిలోనన్
జీకుని జాత్యంధుని నా
లోకింపను దీని మీర లూహింప రొకో;

రాజు—(శాంతము వహించి) అట్లయిన యిదివరకైన దేదో అయి నది. నీయెడగల్గు ప్రేమాతిశయంబున యీతప్పు క్షమించితిని యిక ముందెన్న డిట్టి దుర్యశము గల్గునడతలుమాని యుండు ము. భూసురోత్తములు వచ్చినవెనుక సద్వంశజుఁడగు నొక రాజకుమారున కిచ్చి పరిణయం బొనర్చెదను.

యామి—(సంశయముతో మొగము చిన్నఁబుచ్చుకొని) తండ్రీ! నన్నే రాకొమారున కిచ్చెదరు. అట్లెవ్వరు కోరిరి.

రాజు—నీ కోరికప్రకారమె స్వయంవరమునందు నీవు వరించు రాజకు మారున కిచ్చియె వివాహముఁ జేసెదను.

యామి—తండ్రీ! స్వయంవరమన నర్థమేమి? దాను వరించువానికిచ్చి పెండ్లిసేయుటయేనా, లేక క్షత్రియులకే గాని యితరులకుఁ గూడదను శంక యున్నదా?

రాజు—అట్టిశంకయుఁ గలదు. క్షత్రియవంశజులే స్వయంవరమునకు వత్తురుగాని త దితరులు రా బనిలేదు గాన రాజకుమారులలో నెవ్వరినేని నీయిష్టమయినవానిని గోరికొనవచ్చును.

యామి—త దితరులు వచ్చినచో గోరుకొనవచ్చునా!

రాజు—అట్లేల జరుగును.

యామి—తండ్రీ! అట్లయిన నాకు స్వయంవరమే అనవసరము.

రాజు—యెందుచేత?

యామి—నామనం బిదివరకె యన్యాకాంత మౌటవలన.

రాజు—యిదివరకీ స్వయంవరప్రస్తావన లేనిదె యెవరియందు నీమన స్సన్యాకాంత మయినది.

యామి—తండ్రీ! యిక దాచనేల జెప్పెద వినుఁడు.

ఉ. నాదగు మానసం బిపుడు న్యాయమె యన్యునిఁ గోర నక్కటా,
వాదిఁక రానె వచ్చినది వాంఛిత మట్లనె యుండె నాకు హా
మీ దయఁగోరి యుంటిమిఁక మించినదానికి నేమిసేయ నా
కాదన కీప్రమాదమును గాచి గురున్ బతిసేయుడీ కృపన్.

నాసర్వేంద్రియములు బిల్హణునియందు లీనమై యున్నవి.

రాజు—(కోపముతో) యేమేమి బిల్హణునియందు నీమనము లీనమై యున్నదా, ఓసీ, తుచ్ఛురాలా జూడు యిదె మీయిర్వుర మద మణఁగించెదను. యిటువంటి అంతఃపురద్రోహ మాచరించినందులకు బిల్హణుని బురప్రీతియించి కోటగుమ్మమునకు కట్టించకుందునే? [అని చివ్వునలేచి వెళ్ళబోవును]

యామి—[దుఃఖముతో కాళ్ళపైబడి] తండ్రీ నన్నుగురించి బిల్హణుని క్షమింపవేడెదను. యిందు తప్పంతయు నాయదిగాని బిల్హణుని దణుమాత్రమైనను లేదు గావున నన్ను ఖండించి బిల్హణుని రక్షింప ప్రార్థించెదను.

రాజు—[త్రోలగద్రోచి] ఛీ పాపిష్టురాలా నీమొగముచూడరాదు. త్రోలగుము నిన్నుశిక్షించి బిల్హణుని రక్షింపమనుచుంటివా?

యిందిర్వురు పథార్థులే ముందు బిల్హణుని ఖండించి పిమ్మట నీవిషయమై ఆలోచించెదను?

(నిష్క్రమించును)

యామి—(నిట్టూర్పుతో) హా దైవమా యేమిసేయుదును,

చ. తలపున బిల్హణుండెపతి తప్పకనాకగునంచు నాడు నే
వలపున సాహసింపుచును వానికవుంగిటజేరి క్రీడలన్
సలిపి యనేకబంధముల జాలసుఖంబును బొందితయ్యయో
కలదె పరోపకారులను కాలునిసన్నిధిజేర్పదైవమా.

అయినను,

ఉ. నన్నొక సుందరాంగిగను నల్వసృజింపగనేలనక్కటా
వెన్నెలగాంచి యాకవియు వేడుకవర్ణన జేయనేలనే
కన్నెనటంచెరింగియును కాంతునికౌగిటజేరనేల హా
గ్రన్నన దండిక్రిన్ దెలిసి కంఠముదీయగనేల బిల్హణున్.

అయ్యో; దైవమా నెంతలో యెంతఘోరవిపత్తు దెచ్చిపెట్టితివి. క్షణ కాలముక్రిందటనేగద నానాథుడును నేనును గలసి సంతోష సముద్రమున మునుంగజేసితివి. యింతలోనే నీకు ఓర్వలేని మ త్సరగుణమెట్లుపుట్టె. అయ్యో నామృదులతా బాహువులమ ధ్యనేగౌగలించు నాప్రాణనాథునిశిరము నేడు తలవరుల కరవా లంబున నఱుకబడునే? అయ్యో, నేనుసహించలేను దైవమా నీయెడ నేనేమపచారమొనర్చితిని, జ్ఞానమంకురించినది మొదలు నాప్రాణనాథుని సందర్శన మలవడువరకును నిన్ను ప్రతిదినం బున నాకు చక్కని భర్తను గూర్పుమనియేగదా, ప్రార్థించు చుంటిని. ఔను నిన్ను బ్రార్థించినందుకె గద యిట్టి సుందర పురుషుని పొందు లభింపజేసితివి. యింతలోనె యాతని వలలో దగిలి నీస్మరణ మానుట తప్పుకాదా! అంతకన్న తప్పేమికా

వలయును. మోహాంధురాలనై నీస్మరణమాని యిపుడు తిరిగి నీస్మరణమె, నాప్రాణనాథునిఁ బ్రదికింప కావలసివచ్చెను. నాతప్పు క్షమించి నాప్రాణనాథుని రక్షించునట్లు నాతండ్రి హృదయంబున ప్రవేశించుము. నీ కిదె మ్రొక్కుచున్నాను.

(నిష్క్రమింతుచును)

తెరపడును.

---

## చతుర్థరంగము.

స్థలము—కొల్వుకూటము.

(మదనాభినృపతి, సింహాసనాసీనుఁడై యుండ వసంతుడు మరికొందరు సభ్యులు సేవకులు ప్రవేశింతురు)

రాజు—(మంత్రిం జూచి) అమాత్య శేఖరా! అంతఃపురద్రోహ మా చరించినవాని కేదండన విధించవలయునో ధర్మశాస్త్రప్రకారము జెప్పుఁడు.

వసం—ప్రభువరా! అమర్యాదకార్య మొనర్చిన అంతఃపురద్రోహిని పెద్దలయనుమతిని దండించవలయునని ధర్మశాస్త్రజ్ఞులు జెప్పు చున్నారు.

మాధవ—రాజా మనుజుఁడుసేయుసుకృతదుష్కృతకార్యములంప్రభువు దెలుసుకుని అందు దుర్జనావళిని దండించక విడిచినచో ఆరాజు నకు కలుషము సంభవించునని ధర్మశాస్త్రముఁ జెప్పుచున్నది.

రాజు—సభాసదులారా! దుర్జనకార్య మొనర్చినవాని కవశ్యము శిక్ష విధించుట కర్తవ్యమని ధర్మశాస్త్రము జెప్పుచున్నది గావున మంత్రివర్యా తలవరుల నిటకు నాయాజ్ఞ యైనదని బిల్వ నంపుము.

వసం—చిత్తము. సేవకా!

సేవకుడు ప్రవేశించి—ఏమిసెలవు.

వసం—వీరసేనునితో నలుగురి తలారులను వెంటబెట్టుకుని సభాస్థలికి రమ్మని సెలవైనట్లు జెప్పుము.

సేవ—చిత్తము మహాప్రభూ! (నిష్క్రమించును)

(సేవకుఁడు వీరసేనుఁడు నలుగురు తలవరులు ప్రవేశము)

వీర—(చేతులు జోడించి) జోహారు, జోహారు మహారాజా!

రాజు—ఓరీ వీరసేనా? తక్షణం బిల్హణకవిని మదాజ్ఞ యైనదనిఁజెప్పి పాశములను కాలుసేతులు బంధించి ఘోరశ్మశానవాటికకు దీసుకొనిపోయి నిర్థత్వముఁ బూని నీకరవాలంబున శిరంబు ఖండించి రమ్ము పొమ్ము.

వీర—చిత్తము. దేవా! అట్లనే ఖండించెదను. (తనలో)

గీ. పాప మేమి యొనర్చెనో బాపనయ్య
పాపమే సేయకున్నను బ్రహ్మహత్య
సంభవించును నాకేమి జంపమనుచు
ప్రభువు బల్కెను యతనిదే పాపమంత.

యేదియెట్లున్నను రాజాజ్ఞప్రకారము నాపని నే నెరవేర్చకతప్పదు. మంచోడికి చావొచ్చిందిగదా, (అని తలారులతో నిష్క్రమించును)

రాజు—సభాస్థలులారా, నేఁడు బిల్హణుని శిరముఁ దెగునట్టి మహాపాపపు దినముగావున యీకొల్వు నింతటితో చాలింతము.

సభికులు—చిత్తము, (అందరు నిష్క్రమింతురు)

---

పంచమరంగము

(బిల్హణుఁడు జేత పుస్తకముఁ జూచుచు శయ్యాతలంబున నొదిగి యుండును.)

వీర—(తలవరులతో ప్రవేశించి) బిల్హాణకవోరండి దండాలండి. (చేతు లు జోడించును)

బి—శుభమస్తు.

వీర—బాబూ చుభమస్తు కాదండి, అచుభమస్తు అనండి.

బి—యెవరికిరా, అశుభము.

వీరసే—తమకేనండి బాబూ;

బి—నా కశుభమేమిరా మీ మొగము.

వీర—లేదండి బాబూ, యీ యేల రాజుగోరు నన్ను చభలోకి బిలిపించి ఓరీ; తత్సనం యెల్లి బిల్హాణకవోరిని కాళ్ళుచేతులు చంకిల్లేసి సాసానంకాడికి తీసుకెల్లి (దుఃఖముతో) బాబూ ఏం చొప్పనండి యీకత్తితో మీ చిరసు తెగ్గొట్టమన్నారండి. లేక పోతే నూవంటోల్లు దర్సనం మీ కెప్పుడైనా అయిందాండి

1 తల—పట్టి కట్టండ్రా చూస్తారు ప్రొద్దెక్కుతోంది.

2 తల—(పాశములతో కాలుసేతులు విరిచి కట్టును)

3 తల—చరె పదండిబాబూ యెల్తా మాట్లాడుకుందాం.

వీర—బాబూ మీరే నేరంచేశారో మాకూ కొంతయిన చెప్పలేదండి మీపట్ల దైవయోగ మెల్లాగుందోగాని,

బి—హా! యామినీపూర్ణతిలకా, నీమృదుబాహువులమధ్య బంధించు నన్ను నేడు నీతండ్రి యీ యమభటులనుబోలు తలవరుల పాశములను బంధింపఁజేసె. విధియాజ్ఞ గడవ నెవరితరము. వీర సేనా అట్లనే రాజాజ్ఞప్రకారము మీపని తీర్చుకొండు. [అని తలవరులతో పురవీధులఁబడి పోవును]

(యామినీపూర్ణతిలక విచారముతో మేడమీదనుండి వీధినిఁబోవు బిల్హాణునిఁజూచి దుఃఖముతో ప్రవేశించును)

యామి—హా! యేమి, అయ్యో! మత్ప్రియుండగు బిల్హాణుని శిరచ్ఛేద

నం బొనర్ప రాజు దండన విధించె కాంబోలును, కట్టా దైవ మా! యెట్లు సహింతురు. హా! యెట్లయిననుఁ దండ్రి పాద ములంబడి యీ మరణదండన తప్పించగలందులకు ప్రార్థింతమ న్నను నన్నుఁ జూచునంతలోనె, భగ్గున మండిపడుచు నామొగ మయినఁ జూడకయుండె. నేమిసేయుదాన చెలుల నెవరినైన బంపి నాప్రార్థన తండ్రికడ జెప్పుమన నెవరీపని కంగీకరింపరయ్యె అంతటి మహారాజు గూఁతునై నప్పటికి అవస్థాభేదముచే నేమియు సేయలేక యూరక చూచుండవలసి వచ్చెను.

సీ. నన్ను ప్రేమనుజూచు నాతండ్రి పగబూనె
కాలమెంతటి పాడుకాలమొక్కొ;
తల్లినైనను నిది దప్పించుమని వేఁడ
తనయవు గావని దనిలిగొట్టె
పరిజను లెవరైనఁ బ్రతిమాలుదున యన్న
బిలిచినఁ బలుకరు చులకఁజేసి
చెలికత్తెలను మీరు జెప్పి బ్రోవరె, యన్న
కన్నతండ్రికిలేని కనికరంబు

గీ. నెవ్వారేమంచుఁ జెప్పిన నెట్లు గలుగు
యనెడు వారలె, గాని నా యాపదలను
బాపలేరైరి, దైవమా ప్రాణసఖుఁడు
ప్రాణములుఁ బాయ నేనింక బ్రతుకటెట్లు.

(కవి నుద్దేశించి)

ఉ. హా నవమోహనాంగ నిను హా విషజాలఁగలేను, తండ్రి ఆ
హా నిను జంపగాఁ దలఁచె హా యిఁక నెట్లు భరించుదాననో,
హా ననుఁగూడ జంపుటకు నాజ్ఞయొసంగిన కూడ వచ్చెదన్
నేనిటనుండ నేమిపని నీవు దివంబునకేగ బిల్హణా!

అయ్యో నీవీయెడ దైవమునకే విరోధముఁ జేసితివోగదా? నీకింత బల వన్మరణము దెచ్చుట కేమంత తప్పుఁజేసి క్రూరమగు శిలీము ఖంబున దహించు నన్నుద్ధరించుటయే, తప్పయ్యెనా, యేమి కాలమహిమ-

సీ. హాలాహలమిఁ్రంగి యమృతంబు అమల
కందివ్వడే యీశు డలిముదమున
పదునాల్గు భువనముల్ పదిలంబగా కుక్షి
నిడిభరంపడె విష్ణు డింపుమీర
సకలకల్మషమును సైరించి తనలోన
గల్పదే యెపుడు గంగాభవాని
ఘనపర్వతంబులు కాననంబులు గల్గు
భూదేవి మోఁ్రయదే యాదిశేషు
గీ. డటులె బిల్హణుఁశోఁ్రచుట యర్హమగును
తండ్రితో జెప్పి బ్రోవరే తలనుకాచి
బిల్హణుని బ్రోవరారె యోవేల్పులార
భూసురోత్తములార యోపుణ్యులార.

అయ్యో పూర్వమందునను యిట్టి తప్పులుజేసిన వారులేరా! అట్టివారి ని ప్రమాదమని రక్షించలేదా! యెవ్వరికైననిట్టి ఘోరమగు మరణదండన విధించిరే యిట్టివిధి యీబిల్హణుని నొసటనే వ్రాసె నా? నితడొక్కడే ద్రోహియయ్యెనా? ఏమి?

సీ. మునిపత్నహల్యను మోహించి యిందు్ౖరండు
అమరత్వపదవి తా నందలేదె
గురుభార్యతో గూడు గురుద్రోహియా చంద్రు
నీనుండునెత్తి కెక్కించుకొనడె
కన్నకూతురితోనె గలసిధాతను
శౌరెయంతయును దాసెచలేదె?

కాకాసురుడు తన కాంతను చనుగీర
రఘురాముడతని రక్షించలేదె?
గీ. అందులో నరవీసమీా యవనిసురుని
యందు దోషంబుగలదె? హా! అక్కటకట
నామనంబుసగోరి నాధుడితని
బురిలీయుట ధర్మమే పుణ్యులార!
సీ. కవిసార్వభౌముని గావరే కరుణతో
నామొక్కి కైకొని నలువలార
కవిసార్వభౌముని గావరే కరుణతో
అష్టదిక్కులనేలు యమరులార
కవిసార్వభౌముని గావరే కరుణతో
సర్వంబుగను సూర్యచంద్రులార
కవిసార్వభౌముని గావరే కరుణతో
పక్షపాతముమాని యతులార
గీ. నాకు గవితంబునేర్పిన నాధుడతడు
సుకవిచంద్రుండు సద్గుణ నికరుడతడు
బ్రహ్మకులజుండు విద్యలో బ్రహ్మసముడు
నామనోనాధుగావరే న్యాయమెఱిగి

అయ్యో! ప్రాణనాథా! అతిమృదువులగు నీహస్తపద్మంబులకు పాశములను బంధింప నెట్లోర్చితోగదా! నీప్రియులాలనకు నాగానామృతమున దనివొందు నీకర్ణములు నేడీతలవరుల భీకారార్భటుల కెట్లు సంహించెనో కదా హా! నాథా! యెన్నడైన నిట్టిదుఃఖసముద్రమున మునుగుదుమని కలలోనైన దలంపనయితి. సంతోషాంబుధి నోలలాడు మనకీ దుఃఖసముద్రము తరియించుట దుస్సహాము. దుస్సహాము హా! యెట్లోర్తును. (కవివరునిసమీపించి)

ఉ హాకవిసార్వభౌమ నిను హావిధి యిట్టులజేసె నయ్యయో
నాకిక దిక్కెవ్వరిక నన్నిటు నొంటరిజేసి యేగన
య్యో కరుణించిరమ్మనవె యుల్లమునందు వియోగమెట్లు నే
సోకడశోట్టు దాసనిటు బోయిన నెట్లుభరింతు నక్కటా.

బిల్హ—(దుఃఖముతో యామినీపూర్ణతిలకను జూచి) హా! చెలి యా
మినీపూర్ణతిలకా నన్నుగురించి యేల యిటు దుఃఖించెదవు నే
నిన్ను విడనాడి బోవుటకు మనసాకించియు నొప్పునె కాలమొ
క్కరీతిగాజనునె? యీ మాయాప్రపంచమునందు జీవునికి స్వా
తంత్ర్యమున్నదే? అయ్యో నేనేమిసేయువాడ. యీవియోగ
దుఃఖమెట్లు సహించగలను. మనసురాయిజేసుకొని మోడినై
నీదుఃఖము చూచుచుండుట తప్ప నేనేమిసేయ గలవాడను.

ఉ. హా! సఖ నీవు యీవిధము హాయని దుఃఖము నొంది నొంది
నా హాసమునేల జూచెదవు అక్కట నాకముజేరి యచ్చట౯
వాసముజేయ నెంచితిని వారవధూమణి పొందుగల్గు నీ
యాసను ద్రెంపివేసుకొని యాత్మననున్ మఱుపొందు మిప్పుడే.

నాప్రాణము కొన్నిగడియలలో బోవనయ్యున్నది. అంతవరకు.

సీ. తల్లిదండ్రులు నిన్ను దండింతురను చింత
మనమున నొక్కటే మానదయ్యె
తోడి కామినులలో దొంగవైతివి యంచు
మనమునీవ్యధ మానదయ్యె
కలకాలమీనింద దలధరింపుచు నెట్లు
మనగల వనుదిగుల్ మానదయ్యె
క్షణమైన నన్వీడ సైరింపలేనినీజాలనట్టినీ
యనురాగలత నెట్లు దనుమగలవో

గీ. యనెడు మనమున నీచింత మానదయ్యె
అయ్యయ్యో నీమెడదయనింప డయ్యెనకట

దైవమయినను నీయెడ దయవలంప
డాయె నీదురదృష్ట మేమందునిపుడు.

1వ తల—ఓహోహో! యిందుకే కాబోలును రాజు యీకవోరిని బుర్ర తీయనాజ్ఞాపించుట. ఓరిబాబో యీాశ్మత్సగొయ్య మెంతపని చేసేడురా (బిల్హణుని గెంటుచు) చాలు చాల్ నడవయ్య, రాజు గారి కొమార్తెతో ముచ్చటలాడుచున్నావు. ఓయబ్బోయిం తటోడువయ్యావు బాబూ. తిన్నంటోసాలు లెఖ్కడ్తున్నాడు రోయి. చదువుసొప్పి సరసమాడుతున్నాడు ఊ హూ నడు నడు. రాజింకె మమ్మలనుకూడా బుర్రతీయిత్తాడు.

బిల్హ—(నవ్వుచు) ఓయీ వీరసేనా నన్నేలపరిహాసించెదరు. నేను మీ వెంట రానంటినా.. యీాగెంటు లేల (కొంతదూరమేగి) అదె స్మశానవాటిక చేరువుకు వచ్చితిమి ఆవటావృక్షముక్రింద మదీ యశిరమును రాజాజ్ఞప్రకారము నీనిశితబాణముచే నొక్కవ్రే టున దెగవేయుము. (వటావృక్షము క్రింద నిల్వబడుచురు)

వీరసే—కవిరాజా, మారాజు నిన్ను చంపమని యాజ్ఞయిచ్చె, మేము ను ప్రభువాజ్ఞప్రకారము నిన్ను జంపదలంచియె వచ్చియున్నాము నీవు కొంచమయిన భయములేక నిర్భయముగా తెగనఱుకుమను చుంటివి. నీమనసునందు కొంచమయినను భీతి జనింపని కారణ మించుక జెప్పవేడెదను. కొంచెము సెలవిమ్ము.

బి—అట్టివిషయముండిన నేమిప్రయోజనము. వీరసేనా! నీప్రశ్నకు హితవుతో ప్రత్యుత్తరముఁ జెప్పెద వినుము. యీాక్షితిపతి కుమార్తెయొక్క జగన్మోహనావతారము నా మనంబునఁ జిక్కి జతఁగూడి సతతముఁ ధ్యాయకున్నయది. అంత్యకాలమున

మనుజున కెద్దానియందు గోరికయో అయ్యది కన్నులం గట్టిన ట్లెదురుగా గనంబడుచుండ మరియొక్క విచారమేల దైన్య మేల ? -

1 తల—ఒరేయి మనరాజుగారి కూతురిమీఁద గట్టిగా కన్నేశాడు రోయి, చత్తోన్న అదే స్మరణ గాఁబోలు.

2 వ త—అందుకేరా రాజు బుఱ్ఱ తీయమన్నాఁడు యింకా యీపం డితుని కాపాడుబుద్ధి పోలేదురా, గొప్పపండితులని యింట్లో పెట్టుకుంటె కొంపలు దీత్తారురా యీ బాపనయ్యలు.

వీర—ఆఁ ఆఁ ఉండండ్రా, యింకా యేమేమిపదాలాడ్తాడో సూద్దారి. గొప్పపండితుండంట కాస్సేపు కూకుని అన్నీ యిందారి. చంపి తె మళ్ళీ యీయన పద్దాలు వినబోము. కడసారం గందాయని ఉన్నవి లేనవి అన్నీ పాడేత్తాడు. బాబో మీయిష్టంవచ్చినంత సేపు పదాలాడు యింటాము. బుఱ్ఱ నరకడం యెంతసేపు తెల్లా రిలేస్తె మా కదేపని.

బి—(యామినీపూర్ణతిలక నుద్దేశించి)

చ. చెలి యిక నిన్ స్మరించెదను చిత్తమునం దతిసంభ్రమంబుతో
చెలిమిని బాపినన్ మనసు చేష్టములు బాయునె యెన్నిభంగులన్
దలపున మాన జూచినను తప్పక నీస్మరణంబె నాకిటన్
దలఁ దెగుచుండఁగా నిపుడు దైవపు ప్రార్థనమయ్యెగా సఖీ.

వీర—ఆ హా హా యేమిబాగావుందరా (కత్తి నేలమీఁదఁ బారవైచి) ఒరేయి నాకు నరకడానికి చేతులాడ్డము లేదురా;

1 తల—నే నైతె యొక్కేటు కేసేద్దునుగందా,

వీర — ఛీ! పేలకురా. ఆయనమనస్సు పాడుచెయ్యకు. పాడనియ్యండి,
తర్వాత ఆపని నీవే చేద్దుగాని,

బి_చ. వరసుకుమారి రూపవిభవోజ్వల సద్గుణశీల బాల నీ
కరయుగమధ్య న న్నిడుచు కౌఁగ లొసంగి కుచంబు లొత్తి నన్
సరసరతి ప్రపీణతను సంతసమొందఁగఁజేయు తన్విసిన్
మరి మరి నే స్మరించెదను మంగళదేవతగాఁ దలంపుచున్.

ఉ. పున్నమనాఁటి చందురుని బూర్తిగ వర్ణనఁ జేయునాఁడు హా!
మెన్నఁడు లేనివింత నితఁ డెట్టులఁ జూచునొ యంచు మధ్యగా ను
న్నటువంటి యా తెరను యొయ్యనఁదీసి ననుం గనంగ నే
గ్రన్నన నిన్నుఁ గాంచగను గ్రక్కున మూర్ఛ మునుంగవే చెలీ!

ఉ. అంతట గొంతసేపు నిను యద్భుతమందుచుఁ జూచి జూచియా
కంతుని బారికిన్ వశుడనై పటుగర్వమునన్ దటాలునన్
చెంతకు నేగి నీకరముఁ జేతనుఁబట్టి భయంబు బాపి నీ
వింతటిలోన మూర్ఛిలగ నేమి కతంబని హెచ్చరించనే?

మ. అదిమైనన్ మదిలో దలంచకను నీ వత్యంత లావణ్యమా
వదనంబున్ వికసింపఁజేయుచును న న్వాల్జూపులన్ జూడ హా!
మదనాయంచును నేను మూర్ఛిలనె నీమె చాయల న్గాంచి నా
యెడలో నన్నియుఁ బూసగ్రుచ్చినటు నే నెంతు న్గదా నెచ్చెలీ!

మ. నను మూర్ఛన్ దెలియంగఁజేసియును మ న్నాథుండ వీవై తివం
చును నీగోఁటిటఁ జేర్చి గుబ్బలనెడన్ చోద్యంబుగా గ్రమ్మినన్
మనమందున్ గడుఁ సంతసింపుచును నీ మాయారూపమున్నమ్మి నే
దినముల్ బుచ్చుచునుంట నీ వెరుగవే? దివ్యాంగనా? బొంగుచున్.

చ బటువగు గుబ్బలన్ యురము వ్రియ్యగ గ్రుమ్ముచు శయ్యజేర్చిన
న్నటు యిటు క్రిందుమీఁదుగను హాస్యముగన్ బడఁదోసి నిచ్చచె

దటుకున నన్నుఁ గూడుచును తల్లిని దండ్రి దలంపనట్టి యా
కుటిలవినీలకుంతలను గోరి భజించెద నెమ్మనంబునన్.

ఉ. అంగన నిన్నుఁబోలు యతివల్ గలరే యన అందు కేమియో
సంగడికాఁడ నీ చెలిమి సల్పినఁ జాలదె? సుందరాంగ నీ
సంగము దేవతాసతులె జాలగ వేడెదరన్న నేను నీ
చెంగటనైన జేరుటకు చెప్పగ నొప్పునె యంచు బల్కెనే?

ఉ. అన్నులమిన్న నిన్ను గని యంగజుఁబారికి జిక్కినట్టి న
న్నేనగనేల? నీ సొబగు నెంతయు నెక్కుడుగాదె, నెచ్చెలీ!
పున్నమనాఁటి చందురునిఁబోలు మొగంబునుగల్గు నిన్ను నే
నెన్నఁడు గంటినో యపుడె యే నినుఁ గోరనె యంగనామణీ.

మ. అల యుద్యానవనంబునందు జెలులన్ యాసక్తితోఁ గూడి తీ
వలచెంతన్ దగు చంద్రికాంత శిలపై వాగ్దేవియే వచ్చి వా
లవి వీణన్ బలికించి బాడె సహహా లాలిత్య మే మంచు నే
దలపోయన్ మును వీణబాడు చెలినిన్ ధ్యానింతు నిష్ఠాప్తికిన్.

చ. మదనుని పూజసేయ జను మానినులందర గాంచి నవ్వి నే
నిదె జనుదెంతు బొమ్మనుచు యింట ననున్ రతి దేచ్చి నీనె నా
మదనుడవంచు నర్మిలిని మక్కువ జెక్కిలి ముద్దుబెట్టు యా
మదవతి నెంతయున్ దలఁతు మానసవీథి ననేకభంగులన్.

చ. అతి చతురత్వ మేర్పడగ యందములౌ పదముల్ ఘటించి దా
చతురకవిత్వసంపదల జాల ప్రసిద్ధికినెక్కి పద్యముల్
మతి దలపోసి వ్రాసినను మారుని కేళికి బిల్చునట్టి యా
స్తుతిమతియైన వాక్కులను సుందరి రూపములన్ స్మరించెదన్.

చ. కలకల నవ్వు మోము దొలుకారు మెఱుంగును బోలు దేహ
మున్ గులుకుమిటారి గుబ్బలును గోకిలపల్కులు వారజూపులున్

పలువసరుసందమున్ మదిని బాయుని నీయనురాగ మాత్మలో
పలదలపోయ నాకిపుడు ప్రాణభయంబిది లేదుగా సఖీ.

వీర—ఒరేయి తల్లారులార ఆహా! యేంబాగా పాడుచున్నాడురా మన చెవుల తుప్పువదలిపోయిందరాి. పాపము యీాయన తప్పేమి లేనట్టుందిరా. రాజుగారి కురిది ముందు రమ్మందంట. యీా యనేంచేస్తాడు. అందుకు అడివిపంది చేనుమేసిపోతె ఊరపంది చెవులుకోసి నారన్నట్టుందిరా యీారాజుగారి తీర్పు. గాని యిపుడు మనమొకపనిచేస్తే బాగావుంటుంది. యీా తాటాకులమీాద వ్రాసినపద్యాలన్ని మెల్లగా రాజుగారిదగ్గరకి పట్టుకెళ్ళి చూపిస్తె యిందులోనిజం రాజుకి తెలుస్తుంది. అపుడైన యీాబిల్హణ కవిని విడిచిపెట్ట మంటాడేమో అని నాకు తోస్తుంది.

1వ తల—అవును తనకూతురె మెల్లిగా తెరయెత్తి చూచిందటరా మెరిబాపనోడు యేమి యెరుగని అమాయకుణ్ని సంపమన్నాడుగాని.

వీర—అయిన్న రాజుగారికిపద్యాలు చూపించి వొత్తాను నేనొచ్చేదాకా మీారూరుకోండి (నిష్క్రమించును)

1వ తల—(కవినిజూచి) బాబూ కూంతసేపు కూర్కోండి మావీరసేనుడు వచ్చినతరువాత ఏమిచెప్పతాడో దిక్కుమాలినరాజు నిన్ను చంపుమన్నాడేంటయ్యా కూతురొ్నాదిలేసి.

బిల్హ—ఒరెవరినేనా రాజుకూతు రేమిచేసినదనిరా ఆ మనుజంపిన నన్ను జంపినా ఒకటే యీాతనువులు శాశ్వతమా!

2వ తల—బాబూ యిందులో నిజంకనిపెట్టకుండా యెనళ్ళమాటలో యిని మిమ్మును బుర్రతీయమన్నాడని అల్లుంటిమి.

బిల్హ — రాజులకు న్యాయాన్యాయ విచక్షణ యెట్లు దెలియును. నిజము అబద్ధముగాను అబద్ధమెనిజముగాను మారుచుండును. రాజన భగవంతుడాయేమి. అందుకేగదా రాజ్యాంతె నరకం ధృవమ్మని పెద్దలుజెప్పిరి. యింతకునేను యామినీపూర్ణతిలకకు విద్య చెప్పిన గురువునుగాన నాకు రాజు యీబుహ్మతీయమని గురు దక్షణ యిచ్చినాడు అందుకు మీరేమిచేస్తారు.

వీర — (ప్రవేసించి) ఔరా రాజా నీపట్టినపట్టు విడిచినావుకావుగందా. ఒరేయి పద్యాలుచూచి మరీమండిపడ్డాడురారాజు ఛీ దుర్మార్గా తత్క్షణం నేవిధించినశిక్ష జరపి మరీయిచటికిరా పో. పో అని పద్యాలు గిరకొట్టినాడురా.

బిల్హ — (నవ్వి) ఓయీ వీరసేనా నీజేయు భూతదయాళుత్వముకు నిన్ను మెచ్చితిగాని కఠినచిత్తులగు రాజులమనసు గరగునే? వృధాశ్రమపడి నన్నుగురించి యేలరాజున కాపద్యములంపితివి. నానొదుటివాృత బ్రహ్మ యిట్లులిఖించియుండగా మీరు దుఃఖమొందపనిలేదు. మీమారక రాజుదగ్గరకు తిరుగబనిలేదు. ఖడ్గముబట్టి విచారముమాని శిరము ఖండించుము. జూచిన నేమి ఫలము.

వీర — ఓ దేవబ్రాహ్మణోత్తమా అంతపనికి మాకు చేతులాడకపోయి నందున పరిపరివిధముల విచారించుచుంట నీకిదివర కేమిద్రావిసిరోగాని రాజుమనంబు కరుగలేదు. యీతూరి మంచిపద్యమే దైన జాలిపుట్టేలాగువ్రాసియ్యండిబాబూ పంపిస్తాను అంతకూ దిరగకపోతే అపుడేంచేస్తాము.

1వ తల—అవునండిబాబూ యీమాటు నేనైనా చెడతాను రాజు నాల్గులిట్టితెలిట్టుతాడు నన్నుచంపడు ఏవేళకేంబుద్ధి మారుతుంతో పద్యంవ్రాసి యిప్పించండి.

బిల్హా—ఔర యేలమీకీవెర్రి (బ్రిహ్మనుద్దేశించి)

చ. తనువును జేర్పుమా వికచ తామరసాక్షి వసించు భూమికిన్
తనర రసంబు జేర్చు మల తన్విసుధామ ధురోక్తులందు నీ
మనమును జేర్చుమా మగున మానసదర్పణమందు జూడగన్
అనిలము జేర్చుమా యతివ యత్తరువాసనలందు జేరనీ
కనయము మ్రొక్కుచుంటినిదె యంజలిజేసి విధాతనిమ్మెయిన్.

గీ. తనువు పంచభూతంబుల తగనొనర్చి
జగమనెడి నాటకంబుల చతురగతిని
నాటలాడించి పిమ్మట నైదునైదు
భూతముల జేర్పవే వేగ ధాతనీవు.

దేవా సృష్టికర్తవగు నీచర్యలెన్న నేనెంతటివాడ నిదె త్రికరణసుద్ధిగా మ్రొక్కుచున్నాడ మ్రొక్కుగైకొని నన్ను నీలో గల్పుకొనుము.

వీర—ఓరీ ప్రసేనా యీతూరి యీపద్యాలుకూడా తీసుకుపోయి రాజుగారికి చూపించిరమ్ము యిందువల్ల నేమైన దయపుట్టునోమో చూతాము యీకవోద్దైవప్రార్థన జేసుకుంటూ కన్నులు మూసుకొని ధ్యానిస్తు యున్నారు. నీవు వెళ్ళిరా.

ప్రసే—(తనలో) అట్లనే పోయి రాజుగారికి యీపద్యాలు చూపిస్తాను ఆనక దైవయోగం యేలాగుందో మనచేతనైనంత యీబ్రాహ్మడుకి ఉపకారం చేద్దాము (అని పద్యములు తీసుకొనిపోయి

కొంతసేపటికి వచ్చి) అన్నా వీరసేనా! రాజు నామీద కోప పడి నీకిదే పనిరా దుర్మార్గా, నీమీద నేరమువోపి నీకు శిక్ష విధించెదను యికముందు యిటు రాబోకుము అని కసరినాడు.

వీర — బాబూ మీారేమి రాచినారోగాని రాజుగారికి కోపం మరింత హెచ్చినదంట మనసు కరుగలేదాయె నేమిసేయుము.

బి — ఆహా ! అట్లయ్యెనా, కవితాఖడ్గ మంపినగాని రాజులకీ సామవాక్య ములు సమ్మతించునే తల్లీ భారతీ నీవుండ నాకేమికొదువ నిదె నీవొసగిన పద్యఖడ్గ మంపెదను.

పంచపాది.

'చ. రవిజుఁడు భాగుణింప విధురంబుగ భట్టి నశించె, భారవి ప్రివరుడడంగె, దీర్ఘమున పాణ్రిణముఁ బాసె. గుడియ్య బిక్షుడీ యవనికి దప్పె; భీముఁడు దదంతగతి స్మృతికొమ్ము వెట్ట ని క్కువముగనే భుకుందుడను కొమ్మ్నన దీర్ఘము వెట్టకుండ డీ భువి నత డెన్న నిర్దయుడు భూపతి వీవు దలంప భూవరా.'

ఓపుణ్యాత్మకా యీపద్యము దీసుకొని భయపడక మీారాజుగారిచేతికి యిచ్చిన నన్ను బిలువనంపును దయయుంచి దీనిని దీసికొని పొండు.

వీర—(పద్యము గైకొని) మహాప్రసాదము స్వామి మీాపుణ్య మెట్లు న్నదో నేపోలు రాజుగారి కీపద్యము యిచ్చెదను. నిష్క్రమిం చును. (మరల ప్రవేశించి) ఆహా! యేమి బిల్హణకవిగారి మహా త్యము మెడమీాఁదికి కత్తివచ్చియును తప్పించుకోగల మహా త్వముండిన వీరి కేమికొదువ, (కవింజూచి) మహాప్రభో దండా లండి బాబూ నీపుణ్య మేమని జెప్పుదును మీారు పంపినపద్య

ములు చేతపటుకు రాజు చూచుచుండగానే రాజుగారికి శరీర మంతయు దడబుట్టి నోటమాటరాక గొంతసేపటికి తెల్విదెచ్చు కొని ఓరీ! తత్షణంబ బిల్హణకవిగారిని గందనమాని సగౌరంబు నసభామంటపమునకు తీసుకొనిరమ్ము. అనిసెలవిచ్చినారు. యిది అంతయూ ముందుగా అంతఃపురద్వారసీమ నివసించియున్న ఆయనకుమార్తెగారితో చెప్పి పిమ్మట మీకు విన్నంచి దో డ్కొనిపోవ వచ్చితిని. రాజుగారును మంత్రివర్గముతో మీకు యెదురువచ్చుచుందురు.

---

## షష్టమరంగము.

(యామిపూర్ణతిలక విచారముతోయుండ రాజుకన్నీళ్ళు విడుచుచు ప్రవేశింతురు)

రాజు.—అకట! కుమారి నీయెడల హానిదలంచిన పాతకుండ మామక వదనంబుగాంచుటకు మానస మొప్పదే? కన్న ప్రేమనే నొకకడ ద్రోసి నీగురుని యూరక జంపదలంచితంచు హా యికమరి దుః ఖమొందకుము నీకతనిన్ బతిసేతును,

ఉ. చక్కనివాఁడు బిల్హణుఁడు చక్కనిదానవు నీవు గూడ మి
మ్మొక్కటిజేసె దైవమిక యొప్పదటన్నను జెల్లునొక్కొ! నే
మిక్కిలి హింసబెట్టితిని మీామెడ నిందదలంచియక్కటా!
నుక్కగజేసినాడ నది నుంతయు నీమది నుంచకమ్మరో!

అమ్మా! కాలానుగుణ్యముగా యూరక కష్టములు సంభవించినవిగాని నేను నీకుఁ బగదలంచి యొనర్చినదికాదు. దైవప్రేరితమని యెం చి నాజేయు దుఃఖభరములగు తప్పులు సైరించుము. (అని

(యామినీపూర్ణతిలక చేతులు పట్టుకొని బిల్హణకవికి నెదురుగా జని సభాభవనమున కవింజూచి)

ఉ. ఓకవిసార్వభౌమ నిను యూరక నేరముమోపి సమస్తముర్
హా కఠినుండనై దునుమ నాజ్ఞయొసంగి దుష్టచిత్తుడర్
మీకవితామహత్వమున మిమ్మదిగాచె ననుం గృతఘ్ను నిన్
డా కరుణించి మత్సుతకు దప్పక భర్తవుగమ్ము మొక్కెదన్.

మరియు,

ఉ. యే నొనరించు కుత్సితము నెంతయు మీమది నుంచకయ్య హా
దా నొకటెంచ దైవమది తానొకటెంచడె నిశ్చయంబుగా
యీనరులెంతయున్ దెలియ కెంతెయు మూఢతనునుందురయ్యయో
కానడె దైవమావిధము ,కంతుసమానశరీర సుందరా.

రాజు—(మంత్రింజూచి) మంత్రివర్యా యీబ్రాహ్మణుని మనస్థయిర్యం బతిచిత్రము. నాకుమాత్రె హృదయమును పరిశీలంచగా యీ కవియందెమనోలగ్నమైయుండె, యిందు కేమందురు. యీవిధ ముగా నిర్వురకు దైవాజ్ఞఘటనమయ్యె తప్పింప నేరినశము, అగ్రిజన్ముడును, సకలవిద్యాగరిష్టుడును నగు నీకవిసార్వభౌము నకు నాకన్యనిచ్చుటకన్న వేరె, యీమరణదండనశిక్షకు ప్రత్యు పకారము గలదే?

వసం—మహారాజా! అవశ్య మట్లనే జరిగించుటకు మా అందరియభి మతము నై యున్నది. ప్రభువులమాట కెదురాడ, వెఱచి యింతవరకు మేము తమతో జెప్ప సాహసింపలేకపోతిమి. గాన యామినీపూర్ణతిలకను యా బిల్హణకవిసార్వభౌమునకిచ్చి పరిణ యం బొనర్ప మే మందరేకగ్రీవముగా జెప్పుచున్నారము.

బిల్హ—రాజా నీవు మాామొదల నిందఘటించి తుదకు దైవప్రేరితమని

నిందకోర్చి మమ్మిద్దఱకు వివాహంబుజేయ నుత్సాహించిప్రత్యుపకారముజేసినందులకు దైవము నీకు సకలాభీష్టములొసంగును గాక నీపరిణీయ యుత్సవమునకు మేమిద్దఱము అత్యంతసంతోషంబున సంసిద్ధులమై యుంటిమి.

రాజు—(పుష్పహారమును యామినీపూర్ణతిలక హస్తంబునకిచ్చి బిల్హణునికంఠమున వేయించుట)

బిల్హ—రాజా! యీ యువతీమణి గర్భంబున సహస్రపభాకరుడగు కుమారుడుదయించగలడు. అతడు యుష్మదన్మనవర్తియై అశ్వమేధాధి పెక్కుక్రతువులొనర్చి స్థిరకీర్తిగలవాడై వర్ధిల్లగలడు.

రాజు—మహాత్మా! ఆకుమారునకు ప్రభాకరుడను నామధేయమిడి నాసామ్రాజ్యమంతయు పట్టాభిషేకమొనర్చి నేను ధన్యుడనయ్యెదను.

బిల్హ—తథాస్తు. అస్మదభీష్టమును నట్టిదే.

(భరతవాక్యం)

మ. శ్రీభూనీళల కయ్యములగని సదా స్మేరాననుండౌచు ద
న్నాభిన్ పంకజజన్ముజూచి తన యాః నాకున్నిట్టి సంసారముల్
వేభంగుల్ గలిగింప నీకు దగునే? విశ్రాంతిలేదంచు లీ
లాభావంబునబల్కు కేశవుడు కల్యాణంబులన్ గూర్చుతన్.

సంపూర్ణము.



# శ్రీకృష్ణతులాభారం

ఆరంకముల పౌరాణిక నాటకరాజము.

గ్రంథకర్త:

నేదూరి గంగాధరంగారు

దీనిని "భాగవతము, హరివంశము, పారిజాతాపహరణము, తులసీమహాత్మ్యము, తులాభారమనే యక్షగానము" లందలి కథావిషయములను క్రోడీకరించి చక్కని కథాక్రమముతో రసోచితముగ తేట తెల్లని మాటలతో ప్రదర్శనానుకూలముగ వ్రాయబడిన నాటకరాజమిదియే. దీనియందు 'నారదుని పన్నాగమును, సత్యభామయొక్క ప్రణయ గర్వాతిశయమును, రుక్మిణీదేవి పతిభక్తి ప్రభావంబును, అక్రూరునియొక్కయు, రాధయొక్కయు భక్తి విశేషములున్ను, శ్రీకృష్ణభగవానుని భక్తవత్సలతయు, తులసీమహాత్మ్యమును' జనరంజకముగా పద్య గద్యపాటలతో విరాజిల్లుచున్నవి. భక్తజనానందుడగు భగవంతుని భక్తివాత్సల్యమును భగవల్లీలావిశేషమును పఠించి భక్తులుగందు

వలయువారు:—

కర్రా అచ్చయ్య అండ్ సన్సు,
ఈశ్వర బుక్కుడిపో,
రాజమండ్రి.

| | | |
|---|---|---|
| సంగీత సత్యవిజయ మను హరిశ్చంద్ర | చ॥మా॥ | 1– 0–0 |
| ,, సావిత్రి | ,, | 1– 0–0 |
| ,, ప్రహ్లాద | ,, | 0–12–0 |
| భూలోకరంభ | ,, | 1– 0–0 |
| స్త్రీసాహసము | ,, | 0–10–0 |
| సంగీత పాదుకాపట్టాభిషేకం | ,, | 0–12–0 |
| చంద్రికాంత | ,, | 0–10–0 |
| లంకాదహనము | ,, | 0–12–0 |
| మహారాష్ట్రవిజయము | ,, | 0–12–0 |
| సంగీతశశిరేఖ | ,, | 0– 8–0 |
| సంగీతసారంగధర | ,, | 0–8–0 |
| సంగీతజయంతజయపాల | ,, | 0–8–0 |
| చతురచంద్రహాస | ,, | 0–8–0 |
| విజయబొబ్బిలి | ,, | 0–12–0 |
| ఆంధ్రపతాకము | ,, | 0–8–0 |
| బొబ్బిలియుద్ధం కాళ్లకూరి సాంబశివరావు | | 0–12–0 |
| కన్యకాపరమేశ్వరీవిలాసము | ,, | 0–12–0 |
| సుగుణమణి. వల్లూరి బాపిరాజుగారు | | 0–10–0 |

కర్రా అచ్చయ్య అండ్ సన్సు

ఈశ్వర బుక్ డిపో రాజమండ్రీ